

Chandamama, February '51

Photo by Pranlal K. Patel

పిల్లకాకి













నిమిషములో అందమునిచ్చు
కాష్మీర్
స్నో


RADIO BANGLES






SWASTICK BANGLES




UMA 603


UMA 789








OPEN HERE
MITRANJANAM
REGD


త్వరలో వస్తుంది!!

త్వరలో వచ్చుచున్నది!

# జూపిటర్ వారి



# మర్మయోగి

డైరెక్షన్:
కే. రామనాథ్




పూర్ణా రిలీస్

సంపుటి 8
సంచిక 2

ఫిబ్రవరి
1951

# చందమామ

సంచాలకుడు : చక్రపాణి



ఈ నెల 13-వ తారీఖు రథసప్తమి. సూర్యమహారాజు తన ఏడు గుర్రాల రథంమీద ఇప్పటివరకూ దక్షిణ దిశగా గమనం సాగించాడనీ, ఈ రోజునుంచీ అటు నుండి యిటు మరలి, ఉత్తరదిక్కుకు పోబోతాడనీ శాస్త్రజ్ఞులు చెబుతారు. ఇందుకే మనవాళ్లు ఈరోజున చిక్కుడుకాయలతో రథాలు కడతారు. పైగా ఏడు రేగిపళ్లు, ఏడు జిల్లేడాకులు నెత్తిమీద పెట్టుకుని స్నానం చేయటం పూర్వాచారంగా వస్తున్నది. ఈ ఏడుసంఖ్యకు ప్రాముఖ్యమివ్వటంలో ఏదో అంతరార్థం ఉండి వుండాలి. సప్తమి ఏడవ తిథి. సూర్యుని రథానికి గుర్రాలు ఏడు. ఇలా ఈ దృష్టితో ఆలోచిస్తే మరికొన్ని విశేషాలు గోచరించవచ్చు. జిల్లేడాకులతో స్నానం చేయాలనటంలోకూడా చిత్రమైన సంబంధం కనబడుతుంది. అర్కుడనగా సూర్యుడు. అర్కపత్రమంటే జిల్లేడాకు. మన పర్వాలలో ఇటువంటి విశేషాలు తరిచినకొద్ది బయల్పడతాయి. కనుక, పెద్దలనడిగి తెలుసుకోవాలి.








# అన్నాదమ్ములు

వేరుబడిన యిద్దరు సోదరులొక
ఊళ్లో ఉండేవారు
కాపురాలు వేరైనా మనసులు
ఒకటిగ వుండేవారు.

బంగరు పంటల నూర్పిళ్లొచ్చాయ్
కుప్పలు కొడుతున్నారు.
రైతులు గింజల రాసులు చూచుక
సంబరపడుతున్నారు.

పెద్దవాడు ఒక రేతిరికడ తన
పెళ్లముతో అన్నాడు :
'పిల్లాజెల్లా లేనివాడు నా
తమ్ముడు ఒంటరివాడు.

పాపం సాయము లేరెవ్వరు మన
రాశిలోంచి ఒకభాగం
గింజలు అతని రాశిలో పోస్తా
చెప్పకుండనే వేగం.'

అని అట్లాగే చేశాడాతడు
అక్కడ తమ్ముడుకూడా
'నాకేం హాయికాని మా అన్నయ
మరిపిల్లలు కలవాడా.

రచన:
"బైరాగి"

ఎలా గడుస్తుందతనికి పాపం
నేసాయం చెయ్యాలి.'
అని అన్నాడు భార్యతో అతనికి
పెద్దవానిపై జాలి.

ఇట్లనుకొని అతడుకూడా తన
రాశికడకు పోయాడు.
కొంతవంతు తన ధాన్యం అన్నయ
రాశిలోన పోశాడు.

ఒకరి గుట్టు మరియొకరు యెరుగరని
బహు సంతోషించారు.
ఇద్దరు ఒకరికొకరు వుపకారం
చేశామనుకున్నారు.

తెల్లవారి చూస్తే యేమున్నది
రాసులు యెప్పటిలాగే
ఉన్నవి యిద్దరు చేశామన్నా
రొకరికొకరు బహుబాగే.

అప్పటినుంచీ సోదరులిరువురు
కలిసే వుంటున్నారు.
ఇంకెన్నటికీ విడిపోమని శపథం
పట్టారిప్పుడు వారు.



# గాడిద గర్వభంగం

రచన : "మహేశ్వర్" (మద్రాసు)



గాడిదంటె గాడిదా, మూర్ఖమైన గాడిదా!
చాకి మూట మోసుకొనే రామిగాడి గాడిదా!

ఒకనాడా రామిగాడు సంతలోకి తెచ్చినాడు,
రంగురంగు ముచ్చిరేకు పచ్చ కాగితాలపెట్టె!
ధగధగాను మెరిసేటి పసందైన గుమ్మటమది!

ఘుమ్ముఘుమ్ము వాసనలపూలచెండ్లు కట్టినాడు
పూజాపీఠం మోస్తరుగా పూనికతో చేసినాడు
సీతారాముల బొమ్మలను చిత్రముగా నిలిపినాడు
మూర్ఖమైన ఆ గాడిద మూపుపైని కట్టినాడు.

జనమంతా సందడితో తిరుగాడే బజారందు
సందులంట గొందులంట తిప్పితిప్పి తీసుకొచ్చి
సంసారుల వీధులంట తోలుకొని తెచ్చినాడు
బ్రేకు వేసినట్టు ఆగి, కదలనంది గాడిదా!

భక్తి ముక్తిదాయకమను స్త్రీలంతా చేరినారు
కోటానుకోట్ల దండాలు కోరి కోరి పెట్టినారు
గాడిద కాళ్లకు బాగా సాగి సాగి మొక్కినారు

కొబ్బరికాయలు కొట్టి నైవేద్యం పెట్టినారు
మూర్ఖపు గాడిద కాదిది దేవుడైన గాడిదా!!

పూజాహారతులంది గర్వపడిందా గాడిద
రామిగాడు అదలిస్తే కదలనంది గాడిదా!

"ఇన్నాళ్లకి తన జన్మ పండిందని ఓర్వలేక
ప్రజలంతా మ్రొక్కుతుంటె చూచి సహించలేక
దిక్కుమాలిన రామిగాడు వట్టి మూర్ఖుడనుకుంది!
వాడిమొహం చూసెవడూ కానీ ఇవ్వడనుకుంది"

మూర్ఖపు గాడిదకింత తెగులెందులకన్నాడు
హారతి వెలిగించి దాని తోకకు తగిలించాడు.

ఓంప్రదపెట్టి ఆ గాడిద మొర్రో మొర్రోమనగానె
పూజాపీఠం వెల్లకిలా మొగ్గవేసి నేలబడియె.

అయ్యయ్యో అపచారం అన్నారా ప్రజలంతా
దుమ్ములు విరిగేటట్టు తన్నేరా గార్దభాన్ని
గాడిదంటె గాడిదా దేవుడైన గాడిదా!



# ఎవరి ఫోటో వెయ్యాలి?

హరిహరయ్యరు అనంతపురంలో ప్రాక్టీసు చేస్తూవున్న ఒక అరవ ప్లీడరు. ఆయన పూర్వకాలపు మనిషి. అనగా కట్టు, బొట్టు, జుట్టు మొదలైనవాటిల్లో పెద్దల అచారాలనే అవలంబించేవాడన్నమాట. ఒక్కమాటలో చెప్పాలంటే, ఆయన ప్లీడరీ చేసి లక్షలు గడించినా పిలకమాత్రం మార్చలేదు. ఆయన ఉపనయనంనాడు అది ఎక్కడ ఎలా వెలిసిందో, అదేమో స్తరుగా అదే చోటున శాశ్వతంగా నిలిచిపోయింది. ఈ విధంగా తను పూర్వాచారపరాయణుడై ఉండటమేగాక, కుటుంబంలో అందరూ తన యిష్టప్రకారమే నడుచుకోవాలని ఆయన వుద్దేశం.

అయ్యరుకి పదిహేనేళ్ల వయసువాడు వైద్యనాథన్ అనే కుమారుడున్నాడు. వైద్యనాథన్ చాలా తెలివైనవాడు. ఐదోఫారం చదువుతున్నాడు. అన్నింట్లోను ఎప్పుడూ అతనికే ఫస్టుమార్కు వచ్చేది. ఇందుకు అందరూ వైద్యనాథన్‌ని మెచ్చుకునేవాళ్లు. ఇంతవరకూ బాగానే వుంది.

ఐతే కాలమానాన్నిబట్టి క్లాస్‌లో విద్యార్థులంతా క్రాపింగులు ఉంచుకుంటే, వైద్యనాథన్ మాత్రం తన తండ్రి ఆజ్ఞను అనుసరించి చలిమిడిగుండుతోను మధ్యని వంకాయముచికవంటి రెండంగుళాల పిలకతోనూ స్కూలుకి తయారయ్యేవాడు. ఇది చూచి తోడిపిల్లలంతా వాడిని ఆక్షేపించి ఉడికిస్తూ ఉండేవారు. ఎవరేమన్నా తనను కానట్టుగా దులిపేసుకుని వైద్యనాథన్ తన దారిని తను పోయేవాడు. అంతేగాని వాళ్లతో తగువులాడటం ఎన్నడూ లేదు. నిజానికి, అతని ఓరిమి ఎంతైనా మెచ్చుకోతగిందే.

కాని ఒకరోజున తనకు ప్రాణస్నేహితుడు, ఎన్నడూ తనని ఆక్షేపించి ఎరుగనివాడు ఐన రామిరెడ్డి మాటా మాటా వచ్చి

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు



"పోరా పిలకా!" అనేశాడు. మనసు నొచ్చే టటువంటి ఈ మాట మరొకరెవరైనా అన్న ట్టయితే వైద్యనాథన్ లెక్కచేయకపోను. కాని, రెడ్డి నోటివెంటే ఇటువంటి మాట రావటం వైద్యనాథన్ సహించలేకపోయాడు. అందుచేత క్రమంగా ఇద్దరిమధ్యనా జగడం రగులుకుంది. వైద్యనాథన్ సత్తువ కొద్దీ రెండు గుద్దులు గుద్ది, ఇక అక్కడ నిలవక పరుగుచ్చుకున్నాడు. "సరే కానీ, ఎక్కడికి పోతావులే! ఈమాటు కనపడక పోతావా, నీ పిలక ఎగరగొట్టి చేతిలో పెట్టకపోతానా?" అంటూ సవాలుచేస్తూ రామిరెడ్డి ఇంటికి వెళ్ళిపోయాడు.

ఇంతలో బడికి సెలవులిచ్చారు. తలి దండ్రులతోకూడా రామిరెడ్డి బంధువుల యింటికి ప్రయాణమయ్యాడు. వారు తెల్లవారుజామున వచ్చే ప్యాసెంజరుకి ప్రయాణం పెట్టుకుని, స్టేషనుకు చేరు కొన్నారు. రైలువచ్చింది. రామిరెడ్డి సామాను పెట్టుకునే ఒక బల్లమీదికి గెంతి మెల్లిగా బిచాణా పరిచి, కాళ్లు చాచుకుని దర్జాగా పడుకున్నాడు. పడుకున్న కొంచెం సేపటికే అతనికి గాఢంగా నిద్ర పట్టేసింది.

ఆ నిద్రలోనే రామిరెడ్డి హఠాత్తుగా లేచి కూర్చుని, రైలు ఆపే గొలుసు గట్టిగా చేతపుచ్చుకొని "ఈమాటు ఎక్కడికి పోతావురా భడవా! ఉండు, పిలక ఊడ గొట్టి చేతులో పెడతా"నంటూ పళ్లు బిగిం చాడు.

అతను ఇలా గొలుసు పట్టుకు వేళ్లాడటంతోనే రైలుబండీ ఠక్కున ఆగి పోయింది. రామిరెడ్డి ఆడే ఈ మాటలూ వాలకమూ ఎవళ్లకూ ఏమీ అర్థంకాలేదు. ఈలోపల గార్డూ, డ్రయివరూ, పోలీసూ, కొందరు రైల్వే ఉద్యోగస్థులూ బిలబిల మంటూ పెట్టెలోకి వచ్చేశారు. "ఎవరు గొలుసు లాగింది?" అంటూ వారు ప్రశ్నించే



సరికి, ఏమీ తోచక రామిరెడ్డి తలిదండ్రులు కంగారుపడజొచ్చారు.

అప్పటికీ గొలుసు చేత పట్టుకునే కూర్చునివున్న రామిరెడ్డికి ఈ సందడివల్ల మెలకువ వచ్చిందికాబోలు, "నాన్నా ఇదేం స్టేషను ?" అని అడిగాడు. రెడ్డి తండ్రికి కుమారుడి మాటలు అర్థం కానేలేదు. "ఎందుకురా నాయనా, ఆ గొలుసు పట్టుకు లాగావు ? ఈ మాటలేమిటీ ? ఏమన్నా కల గానే వచ్చిందా ?" అంటూ మళ్లీ అడిగాడు.

రామిరెడ్డి తన చేతిలోది వైద్యనాథన్ పిలకే అనుకుంటున్నాడుగాని, అది రైలు బండీని ఆపే గొలుసు అని తనకే తెలియదు. కొంతసేపటికి అతను స్తిమితపడి, బాగా తెలివిలో పడటం కనిపెట్టి, సంగతి సందర్భాలన్నీ మెల్లిగా అడిగారు తలిదండ్రులు. తనకు వచ్చిన కలనుగురించి రామిరెడ్డి పూసగుచ్చినట్టు చెప్పాడు: "అమ్మా అమ్మా ! హరిహరయ్యరు కొడుకు వైద్యనాథన్‌కీ నాకూ దెబ్బలాటవచ్చింది. 'పోరా పిలకా !' అన్నాను. వాడు ఉడుక్కుని నన్ను రెండు గుద్దులుగుద్ది పారిపోయాడు. ఇప్పుడు వాడు నాకు కలలో కనిపించాడు. వాడి పిలకకూడా నా చేతిలో యిరుక్కుంది. అటువంటప్పుడు పిలక ఊడలాగి వాడి చేతిలో పెడ్తానుకాని, చేతగాని దద్దమ్మ లాగా వూరుకుంటానామరి ?" అన్నాడు.

ఈ కథ విని, ఆ వచ్చిన ఉద్యోగస్థులూ, ప్రయాణికులు అందరూ పకపక నవ్వ సాగారు.

అప్పుడు గార్డు రామిరెడ్డిని సరిగా కూర్చోమని చెప్పి అతని ఫొటో తీయ బోయాడు. ఇదెందుకో అని రెడ్డి తలి దండ్రులు హడిలిపోయారు. ఫొటో తీయడం పూర్తికాగానే గార్డు ఇలా చెప్పాడు: "ఇప్ప టికి మనమందరం అదృష్టవంతులం. రైలు ఇంకొక ఇరవైగజాలు పోయివుంటే బోల్తా

కొట్టి ప్రమాదం కలిగేది. అక్కడి పట్టాలు లాగేసి దుండగీండ్రు గండికొట్టారు. కారణ మేమైతేనేమి, గొలుసు లాగి ఈ చిన్నవాడు రామిరెడ్డి గండంతప్పించి మనల నందరను రక్షించాడు. అతనికి కల రావటం, ఇలా జరగటం, అంతా దైవికమే. పరమేశ్వరుని లీలలు మనకి అర్థం కావు. ఈ రైలు ఆపినందుకు మరొకప్పుడైతే నిబంధనల ప్రకారం రామిరెడ్డికి యాభైరూపాయలు జరిమానా విధించివుందురు. కాని, ఈ సమయంలో రామిరెడ్డివల్ల మనకు కలిగిన మహోపకారానికిగాను అతనికి రెండు యాభైలు, పైగా పదహారు, మొత్తం నూట పదహార్లు బహుమానంగా ఇస్తున్నాము. అంతేగాక, "ప్రాణభిక్ష పెట్టిన పసి బాలుడు!" అనే శీర్షికతో అతని ఫోటో ఇప్పుడే పత్రికలన్నిటికీ పంపిస్తున్నాను" అని చెప్పేసరికి, అక్కడి ప్రయాణికు లందరూ "నా తండ్రే! నా నాయనే!!" అంటూ రామిరెడ్డిని చేరదీసి ముద్దిడుకొన బొచ్చారు. మరునాడు రామిరెడ్డి చరిత్ర ఫోటోతో సహా పెద్దపెద్ద అక్షరాలతో అన్ని పత్రికలలో పడింది.

సెలవులు ముగిసి బడి తెరవగానే రామిరెడ్డి స్కూలుకు వచ్చాడు. ఇదివరకే పత్రికల్లో చూసివుండటంచేత స్కూల్లో మేష్టర్లూ, పిల్లలూ అందరూ రెడ్డిని చుట్టేసి అతని అదృష్టానికి అనేకవిధాల అభినందించారు.

ఇంతలో వైద్యనాథనూ వచ్చాడు. "ఔరే రామం!—నీకు కోపం తెప్పించిందీ, కలలో ప్రత్యక్షమైందీ, చివరకు నీ కీర్తికి కారణమైందీ నా పిలకేకదట్రా? మరి, నా ఫోటో వేయక మధ్యని నీ ఫోటో వేశారేమిట్రా పత్రికల్లో!" అన్నాడు నవ్వుతూ. అతనితో పాటు అందరూ నవ్వారు.

పాఠాలైపోయాక రెడ్డీ, వైద్యనాథనూ చెట్టాపట్టాలేసుకుని ఆటలకు పోయారు.






8

[గెడ్డపువాని పుణ్యమా అంటూ మన కవలసోదరులకు తిరిగి మామూలు చూపు రావటం, పైగా చిత్రమైన అంజనాలూ, భస్మాలూ, మాయతువ్వాలూ సంపాదించటం, అవి తీసుకుని రాకుమార్తెలను వెతుకుతూ గుఱ్ఱాలమీద వస్తుండగా ముందు పోతున్న ఉదయనుడు హఠాత్తుగా మాయం కావటం—ఇంత వరకూ చదివారుకదూ! ఆ తర్వాత—]

ఎప్పుడైతే ఉదయనుడు హఠాత్తుగా మాయమయ్యాడో, అప్పుడు సంధ్యా, నిశీధులు తమ గుఱ్ఱాలను లాగిపట్టి, వేగం తగ్గించి, నెమ్మదిగానే ముందుకు సాగారు. కొంత దూరం పోయేసరికి భవనం ముందువైపు ఒక పెద్ద కందకం కనుపించింది. తమ సోదరుడు గుఱ్ఱంతో కూడా అందులో పడిపోయి వుంటాడని సంధ్యా నిశీధులు గ్రహించారు; కాని బ్రహ్మాండమైన లోతుగల ఆ కందకంలో ఉదయనుడి జాడకానీ అతని గుఱ్ఱంజాడకానీ కనుపించలేదు. వాళ్లకి ఏమీ పాలుపోయింది కాదు. భవనం ప్రవేశిద్దామా అంటే కందకం వెడల్పు కాస్తా కూస్తా కాదు. పోనీ, కందకానికి అసలు మొదలెక్కడో చివరెక్కడో కనిపెడితే భవనం తేలికగా ప్రవేశించవచ్చుననుకున్నారు. ఈ వుద్దేశంతో వాళ్లు గుఱ్ఱాలను నడిపించుకొంటూ కందకం అంచునే అడుగులు వేయజొచ్చారు. కాని ఎంతదూరం పోయినా కందకానికి దరీ అంతూ కనపడలేదు. తిరిగితిరిగి వారు మళ్లీ బయలుదేరిన చోటికే వచ్చేశారు. దీనిని బట్టి ఆ కందకానికి మొదలూ చివరా లేదనీ, భవనంలో ఎవరూ



చొర వీలులేకుండా వుండటానికే చుట్టూతా ఈ కందకం త్రవ్వబడిందనీ వాళ్లు నిశ్చయించారు. కాని ఇంతకూ భవనం ప్రవేశించగలిగే మార్గం స్ఫురించనేలేదు.

కొంతసేపు తీవ్రంగా ఆలోచించినమీదట సంధ్య ఇలా అన్నాడు—"అన్నయ్యా! ఎలాగైనా మనం ఈకందకం దాటితీరాలి. గుఱ్ఱాలమీద దౌడుతీసుకొంటూ వచ్చి ఒక్క దూకున దాటుదాము. దాటగలిగామా అదృష్టవంతులమే. లేదూ, కందకంలో పడటమే సంభవిస్తే మన ఉదయనుడికోసం శాయశక్తులా వెతుకుదాము" అంటూ అన్నను హుషారీ చేశాడు.

ఇందుకు నిశీధుడుకూడా 'భేష్!' అన్నాడు. వాళ్లు మళ్లీ తమ గుఱ్ఱాలనెక్కి కొంతదూరం వెనక్కివెళ్లి శరవేగాన వచ్చి, ఒక్కదూకులో కందకం దాటారు.

అదృష్టవశాత్తూ, ఇద్దరూ కూడా ఎట్టి ప్రమాదమూ లేకుండా కందకానికి అవతలి గట్టున పడ్డారు. "ఇదంతా మన ముందు మంచికే సూచనగా కనబడుతున్నది. ఇక ఫరవాలేదు, కోటలో పాగా వేశామన్న మాటే" అని అనుకొని సంతోషించారు అన్నాదమ్ములు. ఈ సంతోషంతో వారు భవనం ప్రవేశించారేకాని, తీరా చూడగా ఆ భవనంలో మనుష్యసంచారమే లేదు. లెక్కలేనన్ని ద్వారాలు వున్నై కాని ఒక్కదానికీ తలుపులు లేవు. వారు ఒక్కొక్క ద్వారమే దాటుకుంటూ పోతుండగా ప్రతి ద్వారానికీ యిరువైపులా మానవుల శిలా ప్రతిమలు కనబడినై.

చివరికి ఒక పెద్ద ద్వారం చేరుకున్నారు. నిజానికి అది ద్వారం కానేకాదు. ఒక బ్రహ్మాండమైన రాక్షసుడు ఈ రూపంలో ఆకాశమెత్తున నిలబడి నిద్రపోతూ వున్నాడు. వాడి కాళ్లమధ్యనున్న ఖాళీ స్థలమే ద్వారంవలె కనుపిస్తున్నది. ఈ




రాక్షసుడికి రెండు వైపులా రెండు సింహాల ప్రతిమలు వున్నై. అవి జీవకళతో వుట్టి పడుతూ, మీదికి ఉరుకుతామన్నట్టు భయంకరంగా చూపట్టేసరికి, సోదరులిద్దరూ ఒక్కమాటుగా కెవ్వుమన్నారు.

ఈ కేక చెవినిబడి రాక్షసుడికి మెలకువ వచ్చేసింది. అమాంతం సంధ్యా నిశీధులను తన గుప్పిటిలోకి తీసుకుని— "భేష్! భేష్!! మరోరెండు విగ్రహాలు!!!" అన్నాడు ఎంతో ఉత్సాహంతో. వాడు ఈ మాట అనగానే వాడు భవనంలో చూస్తూ వచ్చిన మానవవిగ్రహాలు ఏదో మాయవల్ల తయారైనవే అని ఊహించగలిగాడు.

తలవని తలంపుగా ఇలా చిక్కుబడి పోయినందుకు సంధ్యా నిశీధులు విచారించారు. కాని విచారించి వారు చేయగల దేమున్నది?

ఇటువంటి చిక్కులు జీవితంలో ఎన్నో తగులుతూవుంటై. నిజానికి, చిక్కులలో పడి బుద్ధిబలంవల్ల వాటినుండి తప్పించుకు బయటపడటంలోనే వున్నది మానవుని తెలివి. ఈ వుద్దేశంతో వారు ధైర్యం తెచ్చుకున్నారు. "చావుకిన్ని చావు లున్నవా? ఏమైతేకానీ, ఒక పథకంవేసిచూస్తాను ఈ రాక్షసుడికి" అనుకున్నాడు, నిశితమైన బుద్ధినైపుణి గల నిశీధుడు.

అలా అనుకుంటూ నిశీధుడు రాక్షసుని ఎదుట నించుని, "ఏమయ్యోవ్, మేము ఎవరమనుకుంటున్నావో. మేము ఇక్కడికి దొంగతనంగా రాలేదు. ఫలానా గెడ్డపువాడు మీకు ఒకవార్త అందించమని మమ్మల్ని పంపాడు. అందుకే..." అని యింకా ఏమో చెప్పబోతుండగా రాక్షసుడు ఆత్రంతో "ఏమిటీ వాడు బతికే వున్నాడా? ఇన్నాళ్లూ తిరిగి రాకపోయేసరికి వాడు ఏదో ప్రమాదం వచ్చి చనిపోయాడను కున్నామే! అయితే ఇంతకూ వాడు మీకు

చెప్పి పంపిన వార్త ఏమిటో త్వరగా చెప్పండి" అని తొందరపెట్టాడు.

అప్పుడు నిశీధుడు—"అతని ప్రాణాని కేమీ మోసం లేదు. కాని అతడి జీవిత రహస్యం ఎవరో కనిపెట్టివేశారట. కనిపెట్ట టమేకాదు. అతడిదగ్గిర వున్న భస్మాలూ, అంజనాలూ, తువ్వాలూకూడా కాజేసి పోయారట. అవి లేనిదే తను ఒక్క అడుగైనా ముందుకి వెయ్యలేడట. అందు వల్ల ఈ వార్త మీకు అందజేసి, మళ్లీ కొన్ని అంజనపు డబ్బాలూ, భస్మాలూ పంపమని చెప్పమన్నాడు" అని ఎంతో నమ్మేటట్టు చెప్పాడు.

అంతా విని రాకసుడు—"అలాగా, పాపం! అందుకనే వాడు తిరిగి రాలేక పోయాడు. ఇంకా నయం ఆ దుర్మార్గు లెవరో, వాడి దండ కాజేశారు కారు. అదే జరిగితే వాడిని రక్షించటం ఎవరివల్లా కాదు. సరే, యిక నేను పోయి వస్తాను. మీరు మాత్రం ఒక్క పురుగునికూడా లోపలికి రానివ్వకుండా జాగ్రత్తగా చూస్తూవుం డండి" అని చెప్పి బయలుదేరాడు.

ఎప్పుడైతే రాకసుడు వదిలిపోయాడో సంధ్యా నిశీధులు సంతోషంతో ఎగిరి గంతే




శారు. అంతటి రాకసుణ్ణి టోపీ వేశాంగదా అని వారు ఉప్పొంగిపోయారు. ఇంతలో నిశీధుడు "యిక ఒక్క క్షణంకూడా మనం అలస్యం చెయ్యకూడదు. వాడు తిరిగి వచ్చే లోగా మనం ఈ భవనంయొక్క రహస్యం ఏమిటో కనుక్కోవాలి" అన్నాడు.

అన్నాదమ్ములు ముందుకు సాగారు. మరికొన్ని ద్వారాలు దాటి, చివరిద్వారం కూడా దాటి వెళ్ళేసరికి ఒక పెద్ద కొలను కనుపించింది. అందులో అందాల హంసలు ఈదులాడుతున్నాయి.

ప్రొద్దుటనగా బయలుదేరి హైరాణ పడుతూవున్న ఆ అన్నాదమ్ములకు చాలా




దాహంవేసింది. దప్పిక తీర్చుకుందామని సంధ్య కొలనులో దిగి, పుడిసెడు నీళ్లు తీసుకుతాగాడు. కాని ఆ నీరు గొంతు దిగిందో లేదో, పాపం!- సంధ్య శిలాప్రతిమగా మారిపోయాడు.

తన కళ్ళయెదటనే సోదరుడు యిలా రాయి అయిపోవటంచూచి నిశీధుడు ప్రతిమలా నిలుచుండిపోయాడు. "ఇంకా నయం, నేనుకూడా తొందరపడి తాగినట్టయితే నాగతీ యింతే అయేది. ఉదయునుడి గతి ఏమయిందా అని పాలుపోకుండావున్న ఈసమయంలో సంధ్యకూడా యిలా అయిపోయాడే! నాకూ ఏదైనా ఆపద వచ్చిందా, మా అతీగతీకూడా లోకానికి తెలియకుండా పోతుందే" అని అనేక విధాల చింతించాడు.

నిశీధుడు మరికొంతదూరం ముందుకు పోయేసరికి ఒక పెద్ద తోట కనుపించింది. ఆ తోటలో రకరకాల ఫలవృక్షాలున్నై. అన్నిటికంటే చిత్రమైనది ఒక మామిడిచెట్టు. ఆ చెట్టునవున్న కాయలు యిన్నీ అన్నీకావు. ఎక్కడోగాని ఆకే కనుపించటంలేదు. అంత విరగ కాచిందన్నమాట ఆ మామిడిచెట్టు.

నిశీధుడికి ఇప్పుడు బాగా ఆకలివేసింది. గబగబ ఇన్నిపళ్ళు కోసి, ముందు పడవేసుకుని, ఒక పండుతీసి తినబోయాడు. కాని చిత్రమేమిటో, పండు కొరకటంతోటే నిశీధుడు కోతిగా మారిపోయాడు. కోతిగా మారిపోవటంతో 'అయ్యో బాబో, ఇంకా యేమి విడ్డూరాలు జరగబోతాయో, ఈ రాక్షసమాయలు ఎవరు తెలుసుకోగలరు?' అనుకొని, నిశీధుడు తక్కిన పళ్ళు తినకుండా ఎక్కడివక్కడనే వదిలేశాడు. ఆ కోతిరూపంలోవున్న నిశీధుడు తన సోదరుడైన సంధ్య శిలారూపందాల్చిన కొలను వద్దకువచ్చి, చుట్టుచుట్టూ తిరుగసాగాడు.

ఇంతలో కొలనులోనించి ఏదో బుడబుడ మని శబ్దం వచ్చింది. మరి కొద్దిసేపటికల్లా నీటిలోనించి ఒక హంస తనవైపు రావటం కనుపించింది. ఇదంతా కోతిరూపంలోవున్న నిశీధుడు స్పష్టంగా చూడకలుగుతూనే వున్నాడు.

మరికొద్దిసేపటికల్లా ఆ హంస పూర్తిగా బైటికివచ్చి ఒక మనిషిగా మారిపోయింది. నిశీధుడు ఎగిరి గంతేశాడు. ఎందుకని? ఆ వచ్చింది కందకంలో పడి కనబడకుండా పోయిన తనప్రియ సోదరుడు ఉదయనుడే!



ఉదయనుడు ఒడ్డుకి రాగానే సంధ్య శిలాప్రతిమ కంటబడి, కొయ్యబారి పోయాడు.

ఇంతలో కోతిరూపంలోవున్న నిశీధుడు ఉదయనుడి కాళ్లను చుట్టేసుకున్నాడు. అది మామూలుకోతే అనుకుని మొదట ఉదయనుడు దాన్ని విదిలించి కొట్టాడు. కాని, అది విడవకుండా కాళ్లని చుట్టేసు కోవటంచూచి తన సోదరుడైన నిశీధుడే ఇలా మారిపోయి వుంటాడని అనుమానిం చక తప్పిందికాదు.

ఐతే, ఏమిచెయ్యాలో ఉదయనుడికీ తోచలేదు. సంధ్య యిలా రాయిగా ఎందుకు మారాడో, కోతిరూపంలోవున్నది తన సోదరుడు అవునో కాదో తనకు ఎలా తెలుస్తుంది?

కొంతసేపు అలా ఆలోచించి, ఛటుక్కున ఏదో ఉపాయం స్ఫురించినవానిలా తన జేబులోవున్న భస్మాలూ, అంజనాలూ బైటికి తీశాడు. సంధ్య శిలావిగ్రహంపైన నల్లభస్మం చల్లాడు. ఏమీ కాలేదు. పచ్చ అంజనం రాచిచూచాడు. మార్పు కనిపించ లేదు. ఎఱ్ఱఅంజనం రాచాడు. అప్పటికీ ఆ శిలాప్రతిమ అలాగే వుండిపోయింది. ఇన్ని విధాల ప్రయత్నించినా ఫలితం దక్కక పోయేసరికి, ఉదయనుడు ఆ అంజనాలూ

భస్మాలూ కోతిరూపంలోవున్న నిశీధుడిపైన చల్లాడు. కాని ఈసారీ వాటివల్ల మార్పు ఏమీ రాలేదు. కోతి కోతిగానే వుండి పోయింది.

ఉదయనుడికి ఏమిచెయ్యాలో పాలుపోక కొలను ఒడ్డునే కూర్చుని ఆలోచనలో పడ్డాడు.

అప్పుడు కొలనులోని హంసలలో ఒకటి ఉదయనుడి పాదాలముందుగా పోయింది. ఉదయనుడు చటుక్కున దాన్ని పట్టుకొని బైటికితీశాడు. బైటికిరాగానే ఆ హంస ఒక అందాల కన్యగా మారిపోయింది.

ఆ కన్య సిగ్గుతో తలవంచుకుని మాట్లాడకుండా నిలబడింది. ఆమెతో ఉదయనుడు—"నీ వెవరవు? ఇలా హంస రూపంతో ఈ కొలనులో ఎందుకున్నావు? చెప్పితే......" అని యింకా ఏమో అనబోతుండగా—

"ఎక్కడరా మీరూ?" అనే పెద్దకేక ఒకటి వినిపించింది.

ఎప్పుడైతే ఈకేక వినిపించిందో వెంటనే ఆ కన్య వస్తున్నది భవనాన్ని కాపలాకాసే రాక్షసుడేఅని తెలుసుకుని, ఉదయనుడితో- "అదంతా తర్వాత చెబుతా. ముందిప్పుడు ప్రాణాలు రక్షించుకోవాలి" అంటూ, సంధ్య శిలాప్రతిమనూ, ప్రతిమదగ్గిరవున్న కోతినీ కొలనులోకి తోసివేసింది. వెంటనే అవి రెండూ హంసలుగా మారిపోయాయి. తర్వాత ఉదయనుడి చెయ్యి పట్టుకుని తనుకూడా కొలనులోకి దూకింది. దూకీ దూకటంతోనే వాళ్ళిద్దరూకూడా హంసలై పోయారు.

[హంస రూపంలో వున్న ఆ కన్య ఎవరు? మన కథలకు తిరిగి మామూలు స్వరూపాలు వచ్చాయా? అంతకూ వాళ్లు చిక్కుపడిన ఆ మాయా భవనం ఎవరిది? ఈ చిత్రాలన్నీ వచ్చే నెల చందమామలో చదవండి]






# ధర్మసందేహం

ఒకానొక అరణ్యంలో మునీశ్వరుడు ఒకాయన తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఆయన పేరేమిటో ఎవ్వరికీ తెలియదు. కాని స్వభావాన్నిబట్టీ గుణగణాలనుబట్టీ సహజసిద్ధంగానే ఆయనకు సత్యకేతుడనే పేరు సార్థకనామంగా యేర్పడిపోయింది, లోకంలో.

సత్యకేతుడికి అబద్ధమాడటం ఎటువంటిదో తెలియనే తెలియదు. పోతే—ఏ ప్రాణినీ హింసపెట్టటం ఆయనకు సుతరామూ ఇష్టంలేదు. అందుకనే కొమ్మనుండి కోసినట్టయితే చెట్టుకి ఎక్కడ నొప్పి పెడుతుందోనని చెప్పి, నేలను రాలిన పండ్లనే తీసుకుతినేవాడు. లేగల నోట్లో కరక్కాయ కొట్టినవాడనవుతానేమోనని అవి పాలు తాగినప్పుడు చిందే నురగలుమాత్రం ఆరగించి జీవాలు నిలబెట్టుకొనేవాడు. అంతటి అహింసాపరుడు సత్యకేతుడు.

ఒకనాడు సత్యకేతుడు తన ఆశ్రమంలో దర్భాసనంమీద కూర్చుని, రుద్రాక్షమాల తిప్పుకొంటూ జపం చేసుకొంటూ వున్న సమయాన ఒక అడవిపంది ఉరుకులేసుకుంటూ పరుగెత్తుకువచ్చి, ఆయనకు సమీపంలో వున్న ఒక పొదలో దూరింది. చూడగా దాని ఒళ్లంతా రక్తమయమై వుంది! ఇది తప్పక వేటకాని బాణపు దెబ్బ తినివుండాలె అని నిశ్చయించుకున్నాడు సత్యకేతుడు.

"పాపం, ఒక్క దెబ్బకే ఈ అడవిపంది నెత్తురు వరదలు కారుకొంటూ వచ్చింది. మరివక దెబ్బ ఎక్కడ తగులుతుందో నన్న భీతాహంతో అది రొజుకుంటూ ఇలా వచ్చి తలదాచుకునివుండాలి. ఇప్పుడు దీన్ని ఎలా కాపాడటం!" అని అనుకుంటూ, దాని రక్షణనుగురించే ఆలోచించసాగాడు మునీశ్వరుడు.

ఆర్. కృష్ణమూర్తి, మదరాసు




ఇంతలో అక్కడికి ఒక వేటగాడు వచ్చాడు. కాటుకరంగుగల శరీర చ్ఛాయతో, చింతనిప్పులవంటి కన్నులతో, కోరమీసాలతో చూడ భయంవేస్తూ ఆజాను బాహువుగావున్న ఆ వేటగాడు అతివిన యంగా మునీశ్వరునికి నమస్కరించి, "బాబూ, ఈ దారిని అడవిపందేమైనా వచ్చిందా ? చూస్తే చెప్పండి" అంటూ అడిగాడు.

ఆయన యేమీ మాటాడకపోయేసరికి, వేటగాడు మళ్లీ "బాబయ్యా! పొద్దుటే లేచి ఎవరి మొగం చూచానో కాని ఇవాళ అడివంతా తిరిగినా ఒక్క జంతువూ కన పడిందే కాదండి. ప్రాణం విసిగి, ఇక పోదామా అనుకునే వేళకి నా అదృష్టం బాగుండి ఈ పంది కనపడిందండి. కాని యేం లాభం ? బాణం దెబ్బకు పడక తప్పి పోయి అది ఇటు వచ్చేసిందండి. దీన్ని కొట్టి, మాంసం పట్టుకువెళ్లి అమ్ముకువస్తేనే నా పెళ్ళాం బిడ్డలకు కూడు దొరుకుతుంది, లేకుంటే లేదు. ఇప్పటికి మూడు రోజు లాయె తిండిలేక మేమందరం పస్తులే ఉంటున్నామండి. ఇది దొరికితేనేతప్ప ఇవాళకూడా మేము ఆకటి కడుపులతో మాడి ఉండవలసిందే" అంటూ తన సంసారబాధలు చెప్పుకొని దీనంగా మొర పెట్టుకున్నాడు.

ఇంతవరకూ పంది అవస్థచూచి జాలి పడిన సత్యకేతుడికి వేటగాని అవేదన చూచి మరింతగా మనసు నీరైపోజొచ్చింది. ఐతే ఏమిటి చేయడం? వేటగాడు చెప్పిన దాన్నిబట్టి ఆకలిబాధవల్ల అతనూ అతని కుటుంబమూ చచ్చిపోయేటట్టున్నారు. పోనీ, ఏమైతేకానీ, ఆ పంది జాడ చెబు దామా అంటే శరణుచొచ్చిన ప్రాణిని జీవం తీసివేయడమవుతుంది. ఎలా గా ? ఏమి చేదామన్నా పాపం చుట్టుకోవటం

తప్పనట్టే కనబడుతున్నదాయె. ఒక్క మాటలో చెప్పాలంటే పచ్చివెలక్కాయ గొంతున పడినట్టయింది మునీశ్వరుడికి.

అటు ఆ పందికిగాని, ఇప్పుడు వచ్చి మొరపెట్టుకొన్న వేటగానికిగాని హింస జరగటం సత్యకేతునికి ఎంతమాత్రమూ మనస్కరించలేదు.

అందుకని కాస్త తీవ్రంగా ఆలోచించి ఆయన "అబ్బీ! పందినిచూస్తే చెప్పమని కోరావు. కాని చూచేవి కళ్లు. చూచింది చెప్పటం కళ్లకు చేతకాదు. ఒక్క నోటికి మాత్రమే మాట చెప్పగల శక్తివున్నది. ఐతే యేమిలాభం? నోరు చూడలేదు. చూడందీ ఈనోరు ఏం చెబుతుంది?" అని వేటగానికి జవాబు చెప్పాడు.

ఇంత యుక్తిగా జవాబుచెప్పిన మునీశ్వరుణ్ణి మరేమి అడగటానికి వీలు చిక్కింది కాదు వేటగానికి. అబద్ధం చెప్పకుండా పంది ప్రాణాలను కాపాడిన సత్యకేతుని ప్రజ్ఞను మెచ్చుకొన్నాడా అన్నట్టుగా, అంత ఆకలితో వచ్చిన ఆ వేటగాడు తృప్తిపడి నట్టు కనపడి చిరునవ్వు నవ్వజొచ్చాడు.

ముని చూస్తూండగానే వేటగాని నల్లటి శరీరమంతా బంగారు ఛాయగా మారి




పోయింది. అతని చేతిలోఉన్న విల్లు కాస్తా త్రిశూలమై ఊరుకుంది! విరబోసికొనివున్న అతని జుట్టుకు ముడియేర్పడి, ఆ ముడిలో గంగాదేవీ, చందమామా కనపడ్డారు.

'ఇంకా సందేహమేమిటీ, సాక్షాత్తు ఆ పరమేశ్వరుడే ఈ రూపంలో నాకు దర్శన మిచ్చాడు, ఎంత అదృష్టం' అనుకొంటూ సత్యకేతుడు ఆ దివ్యసుందరమూర్తికి సాష్టాంగపడ్డాడు.

పరమేశ్వరుడు అతణ్ణి లేవదీసి "వోయి సత్యకేతూ! నీవు అవలంబిస్తున్న అహింసా వ్రతానికి అసత్యమాడకపోవటానికి మధ్యని చిక్కుప్రశ్న కల్పిస్తే, నీవు ఎలా నెగ్గుతావో

చూతామనే సంకల్పంతోనే ఈ సమస్య కల్పించాను. నీ బుద్ధిబలంవల్ల సత్య వ్రతాన్నీ, అహింసావ్రతాన్నికూడా చక్కగా కాపాడుకున్నావు. ధర్మం నిలబెట్టావు. పరీక్షలో నెగ్గావు" అని సంతోషాన్ని తెలియపరిచాడు.

అందుకు సత్యకేతుడు "దేవా! అంతా నీ అనుగ్రహం" అన్నాడు.

అప్పుడు పరమేశ్వరుడు "సత్యకేతూ! నీవు కళ్లతోచూచి, నోటితో చెప్పలేకపోయిన ఆ వరాహలలన ఎవరో తెలుసా?" అన్నాడు.

ఇలా అంటూవుండగానే పొదలో దాగివున్న అడవిపంది మాయమై, ముసిముసి నవ్వులతో పార్వతీదేవి చక్కావచ్చి ఈశ్వరుని పక్కన నిలబడింది!

ఈ మాయకు తన్మయుడై, సత్యకేతుడు పురాణదంపతులను స్తోత్రము చేశాడు. అప్పుడు వారు ఉభయులూ కలిసి "ఓయి భక్తాగ్రేసరా, సత్యకేతూ! ధర్మరక్షణచేసిన నీ చాకచక్యానికి మేము సంతోషించాము. నీ కేమి వరం కావాలో కోరుకో" మన్నారు.

అందుకు సత్యకేతుడు "పుణ్యదంపతులారా! మీ దర్శనభాగ్యంకంటె నాకు కావలిసిందేమిటి? ఐనా, మీరే నాపైన అనుగ్రహం ఉంచి కోరుకోమన్నప్పుడు వద్దనటం వివేకలక్షణం కాదు. కాబట్టి, ఇక ముందుకూడా ఈ రెండు ధర్మాలనూ నేను తప్పక నెరవేర్చి, ఈ ప్రతిష్ఠ నిలబెటుకోగలిగేటట్టు దీవించండి, చాలు" అన్నాడు.

అతని కోరిక విని వారు చిరునవ్వు నవ్వారు. ఇంతలో ఒక విమానం భూలోకానికి దిగివచ్చి, వారిని గగనమార్గాన తీసుకుపోయింది.

అనాటినించీ సత్యకేతుడు జీవితాంతం వరకూ తను సత్య, అహింసావ్రతాలను నెరవేర్చటమేగాక, తన ఆశ్రమంలో శిష్యగణాని కంతటికీ ఈ సుగుణాలయొక్క ప్రభావాన్ని బోధచేసి తరించాడు.






**అనగనగా** రణార్ణవుడనే ఒక రాజు ఉండేవాడు. ఆయన బహు దుర్మార్గుడు. పైగా ప్రథమకోపి. ఎవరిమీదనైనా ఆయనకు దయ తప్పిందంటే, మారుమాట లేకుండా మరణశిక్ష విధించేసేవాడు. ఈ విధంగా నిరపరాధులు ఎంతోమంది ఆయనచేతిలో చనిపోతూవచ్చారు.

రణార్ణవుని ఆస్థానంలో సమయజ్ఞుడనే జ్యోతిష్కుడు ఒకాయన ఉన్నాడు. రాజు ఏపని చేయబోయినా, ముందు సమయజ్ఞునితో సంప్రతించేవాడు. అందుచేత, రాజు ప్రశ్నలకు ఆయన సరియైన సమాధానం చెప్పవలసి ఉండేది. ఎన్నడైనా ప్రశ్న తప్పిపోయిందంటే, దయాదాక్షిణ్యమూ లేకుండా తనకుకూడా రాజు మరణశిక్ష విధిస్తాడన్న సంగతి సమయజ్ఞుడికితెలుసు.

ఒకప్పుడు రణార్ణవుడు పొరుగురాజైన శూరసేనునిమీదికి దండెత్తదలిచి, "ఏమయ్యా, సమయజ్ఞా! నేను ఒకపని తలపెట్టాను. అది జయమవుతుందా, కాదా?" అని ప్రశ్న అడిగాడు. అందుకు సమయజ్ఞుడు రెండవతలంపు లేకుండా "ఏలినవారికి ఎప్పుడూ జయమే!" అనేశాడు.

ఇంతవరకూ ఒక్కసారికూడా సమయజ్ఞుడు చెప్పిన ప్రశ్న తప్పిపోలేదు. కాబట్టి ఇప్పుడుకూడా అతను చెప్పిన మాటలను బట్టి తన పథకం నెరవేరుతుందని రణార్ణవుడు ధైర్యం చెందాడు. ఈ ధైర్యంతో ఆయన శూరసేనుణ్ణి తన దర్బారుకు రప్పించి, మంచిగా మాటలు చెప్పసాగాడు. ఇలా నమ్మించి, శూరసేనుణ్ణి చెరబెట్టుదామని కుట్రపన్నే వున్నాడు, రణార్ణవుడు.

ఐతే - ఇటువంటి కుట్రలు ఎన్నయినా ఇట్టే కనిపెట్టివేయగల సూక్ష్మగ్రాహి శూరసేనమహారాజుకి మంత్రిగా ఉంటున్నాడు. అతని పేరు దూరదర్శి. రణార్ణవుని దుర్మా

డి. హరినారాయణ, బళారి



ర్గాన్నిగురించి ఏనాడో తెలుసు, దూరదర్శికి. అటువంటప్పుడు, తన యజమానుడైన శూరసేనుణ్ణి అరణార్ణవుడు ప్రేమ నటిస్తూ పిలిచినంతమాత్రాన పొంగిపోతాడా ? ఎందుకోసం ఇలా రమ్మంటున్నాడా అని దూరం యోచించి, ఇందులో గల లోగుట్టు తెలుసుకుని, దూరదర్శి తగిన బందోబస్తులో ఉండనే వున్నాడు.

అక్కడ రణార్ణవుడు శూరసేనునితో తీయతీయగా మాటాడుతూ, అతడు ఏమరి వుండగా తన పరివారానికి కనుసైగ చేశాడు. వాళ్ళు వెనకాలే వచ్చి శూరసేనుణ్ణి బంధించివేశారు.

కాని, మరుక్షణంలోనే తలవని తలంపుగా దూరదర్శి తన సైనికబలంతో అక్కడ ప్రత్యక్షమయ్యాడు. ఆ సైనికులు రణార్ణవుడినీ, అతని పరివారాన్నీ కలిపి చుట్టుముట్టారు. దూరదర్శి సంజ్ఞ చేయగా తక్షణమే వారు రణార్ణవుని చేతులకు బేడీలు తగిలించారు. అతని కళ్లఎదటనే తమ ప్రభువైన శూరసేనుని విడిపించారు.

చేసేదిలేక రణార్ణవుడు కడివెడునీళ్లకు ఏడ్చుకొన్నాడు. కాళ్ళావేళ్ళాపడి దూరదర్శిని బ్రతిమలాడగా అతడు దయదలిచి, మరెన్నడూ ఇటువంటి దుష్టచేష్టలు చేయకుండా తగినటువంటి కఠినషరతులు పెట్టి బుద్ధి చెప్పి, మరీ వదిలాడు.

ప్రశ్న తప్పిపోయినందుకూ, ఈవిధంగా తనకు తీరని పరాభవం జరిగినందుకూ రాజు ఉగ్రుడై, సమయజ్ఞుడి భరతం పట్టాలని నిశ్చయించుకున్నాడు. రాత్రికిరాత్రి జ్యోతిష్కుని రమ్మని కబురుపంపించాడు. పరిచారకులు పోయి సమయజ్ఞుణ్ణి పిలవగానే అతడు జరగబోయేదంతా చిటికలో గ్రహించేశాడు. "అబ్బాయిలూ !— మన ప్రభువువారు వెళ్ళిన పని యేమైందిరా ?" అని ప్రశ్నించేసరికి, రాజు ఓడిపోవటాన్ని

గురించి వాళ్లు పూసగుచ్చినట్టు చెప్పారు. అప్పుడు సమయజ్ఞుడు తనమనసులో ఇలా అనుకున్నాడు: "ప్రభువుల ఆస్థానంలో వుద్యోగం చేయటమే చాలా కష్టమైనపని. ఏమీ అంటే ప్రభుచిత్తం ఏక్షణానికి ఎలా మారుతుందో ఎవరూ చెప్పలేరు. అందులోనూ దుర్మార్గుడూ, ముక్కోపీ అయిన రణార్ణవునివంటి రాజుకింద నవుకరీ కేవలమూ దినదినగండమే. ఏదో దేవుని కృప వల్ల నేటివరకూ దుష్టునివద్దనైనా నెగ్గుకు వచ్చాను. కాని, ఇంతటితో నాపని సరి. నాకు ఆయువు మూడటంచేతనే ప్రశ్న తప్పిపోయింది. విధివిలాసం అలావుండగా నేనేమి చేయగలను? కించిజ్ఞుణ్ణి అయిన నాలో ఏమున్నది? ఈ సమయంలో నేను అధైర్యపడి జంకితే అసలే లాభంలేదు. ఆపద వచ్చినప్పుడే గుండెనిబ్బరం అవసరం. కనుక, వెళతాను. వెళ్లితీరుతాను. పరిస్థితులు గమనిస్తాను. పరమేశ్వరుడు తోపించిన విధంగా జవాబు చెబుతాను. అంతా ఆ జగన్నాటకసూత్రధారుని దయ!" అని తలచి, కోటకు బయల్దేరాడు.

తన అలవాటుప్రకారం రాజు కోపమంతా దిగమింగుకొని సమయజ్ఞునితో



ఆప్యాయంగా ప్రసంగం ప్రారంభించాడు. ఈ నక్కవినయాలు ఎందుకో సమయజ్ఞునికి తెలియనే తెలుసు. పైగా, పక్కపక్కలనే తలారులు పొంచివుండటంకూడా కనిపెట్టాడతను. ఐనా, ఏమీ భయపడలేదు.

కొంతసేపు బాతాఖానీ వేశాక రాజు ఆప్యాయంగా, "అయ్యా, జ్యోతిష్కుడుగారూ! ఎందరెందరికో తమరు జాతకాలు చూచి ఫలితాలు చెప్పారే, మీ జాతకం ఎలా నడుస్తుందో ఎప్పుడైనా స్వయంగా చూచుకున్నారా?" అని ప్రశ్నించాడు.

"చూచుకోకేం, చూచుకొనే వున్నాను ప్రభూ!" అంటూ జ్యోతిష్కుడు ఏ

మాత్రం నదురూ బెదురూ లేకుండా పూటిగా చెప్పాడు.

"ఐతే మీ ఆయురాయం ఎంతండీ?" అని మళ్లీ అడిగాడు రాజు.

ఒకవేళ, ఏ పదేళ్ళో పదిహేనేళ్ళో అని సమయజ్ఞుడు చెబితే, పీకమీద కత్తిపెట్టి "ఈమట్టున నిన్నునరికేస్తే నీజ్యోతిషంతప్పి పోయినట్టేకద! నీ సంగతే నువ్వు సరిగా చెప్పుకోలేనివాడవు ఇతరులకు ప్రశ్న చెప్పే దేమిటోయి వాజమ్మా" అని అనవచ్చు రాజు. ఇంత అర్థమున్నది, ఇప్పుడు రాజు వేసిన ప్రశ్నలో. అంతమాత్రానికే లొంగి పోతాడా, బుద్ధికుశలతగల సమయజ్ఞుడు?

ఒక్క ఐదునిమిషాలు తీవ్రంగా ఆలో చించినట్టు నటించి, "రాజా! జ్యోతిశ్శాస్త్రానికి పార్వతీదేవి శాపం ఉన్నదండి. కనుక జ్యోతిష్కులు చెప్పినవన్నీ జరుగుతాయనటానికి వీలులేదు. అందులోనూ, స్వంత విషయంలో అసలే వీలుకాదు. ఐతే—నా ఆయుర్దాయంవిషయంలో మాత్రం ఒక చిత్రమైన రహస్యమున్నది. ఈ రహస్యం నేను నాభార్యకైనా వెల్లడిచేసి ఉండలేదు. కాని, ఏలినవారు అంతగా నా క్షేమంకోరి అడిగినప్పుడు ఇక దాచటం భావ్యంకాదు. అది యేమిటీ అంటే—నేను మరణించిన పది ఘడియలలో ప్రభువులకు ప్రాణాపాయం కలుగుతుందని జాతకంలో రాసి వున్నది. కనుకనే ఎందరు రాజులురక్షిన్నా తమర్ని వదిలి వెళ్ళటమంటే నాకు మనస్కరించక నిలిచిపోయాను" అన్నాడు.

ఈమాట వినగానే, రణార్ణవుడు ఏమను కొన్నాడో యేమో, తలారులను పొమ్మని సైగచేశాడు. నలుగురు భటులను తోడిచ్చి సమయజ్ఞుణి పదిలంగా ఇంటికి పంపించి వేశాడు. నాటినించీ సమయజ్ఞునికి చీమైనా కుట్టకుండా కాపాడుతూ, తన పంచప్రాణాలలోనూ అతన్ని ఒక ప్రాణంగా చూచు కొంటూ ఉండసాగాడు.






అనగనగా ఉజ్జయినీ నగరంలో శేషయ్య శెట్టి అనే వర్తకుడు ఉండేవాడు. అతను పొగాకు వ్యాపారం చేసి మంచి డబ్బూ అనుభవమూ గడించాడు.

ఒకరోజున అతని స్నేహితుడైన చెంగల రెడ్డివచ్చి "ఏమయ్యా శెట్టీ! ఇప్పటికి ఇరవై యిళ్లు కట్టించావు. ముప్ఫయి లక్షలు నిలవ వేశావు. పొలాలు పుట్రలూ దండిగా సంపాదించావు. ఇంకా ఎంత గడిస్తే నీకు తృప్తి కలుగుతుంది? ఆశకు అంత మున్నదిగనకనా? ముందుగతి చూచుకో వాలెగాని ఎప్పుడూ ఈ ఐహికలంపటంలో పడి కొట్టుకోవటమేనా? లే, పద. అటు పోయి దక్షిణదేశ యాత్రలు చేసుకువద్దాం. పుణ్యం పురుషార్థంకూడా కలిసివస్తుంది," అంటూ నూరిపోశాడు.

ఈ ప్రబోధం శేషయ్య శెట్టి మనసుకి ఎక్కింది. రెడ్డి చెప్పినదానికి వెంటనే అంగీకరించాడు. తన అస్తిపాస్తులూ, పొగాకు వర్తకమూ కుటుంబానికి వప్పగించేస్తూ "అబ్బాయిలూ! చేతనైందేమో గడించిపెట్టాను. ఇక తీర్థయాత్రకు పోయి పుణ్యం సంపాదించుకోవాలి. కనుక, ఇటుపైన సంసారమూ, వ్యాపారమూ మీ అంతట మీరే చక్కబెట్టుకోండి" అని చెప్పి వ్యాపారంలోని మెలకువలూ కీలకాలూ వాళ్ళకు వెల్లడిచేశాడు.

అనుకున్నట్టుగానే చెంగలరెడ్డీ, శేషయ్య శెట్టికలిసి యాత్రకు బయల్దేరి, ముందుగా మధురాపట్టణానికి చేరువనే ఉన్న చిన్న క్షేత్రానికి వెళ్లి అక్కడ వుండే కళ్లళఘర్ స్వామికి పూజా పురస్కారాలు జరిపించారు. పూజఐనతరువాత శేషయ్య స్వామివిగ్రహం చూచి "రెడ్డీ! ఈ స్వామి ఎందుకోసం ఒకచెయ్యి మీదికీ ఒకచెయ్యి కిందికీ చూపిస్తూ కూర్చున్నాడు?" అని అడిగాడు

ఎస్. బాలభారత్ సింగ్, నడిగుంటపాలెం




ఈ ప్రశ్నకు ఏమి జవాబు చెప్పాలో తెలిసిందికాదు రెడ్డికి. ఐనా అంతమాత్రాన 'నాకు తెలియదు' అని వప్పుకోవటానికా మనస్కరించలేదు. అందుకని, యుక్తిగా "ఓయి శెట్టీ! మనం భక్తితో స్వాములను సేవించుకోవటమేగాని, మధ్య మధ్య ఇలాటి కుశ్శంకలు పెట్టుకోకూడదు. నీ సంశయం తరువాత తీరుస్తాలే" అని చెప్పి అప్పటికి తప్పించుకున్నాడు చెంగలరెడ్డి.

ఆ తరవాత వారు కంచికి పోయి వరదరాజస్వామిని సేవించుకున్నారు. ఇక్కడ మళ్లీ శెట్టికి ఒక సంశయం కలిగింది. "ఏమయ్యా నేస్తం!—అళఘురు స్వామి ఒక చెయ్యి మీదికీ, ఒక చెయ్యి కిందికీ పెట్టుకు కూర్చుంటే ఈ వరదరాజస్వామి రెండు చేతులూ దోసిలి పట్టినట్టుగా చాపుకొని వున్నాడేమి?" అని ప్రశ్నించాడు.

ఈ ప్రశ్నకూ సమాధానం తెలియలేదు రెడ్డికి. ఐనా ఏదోలాగా తప్పించుకోవాలని "అబ్బాయీ!—చెప్పానుకాదా, యాత్ర చేసుకునేటప్పుడు మనం ఎటువంటి సంశయాలూ పెట్టుకోగూడదని. అలా పెట్టుకున్నట్టయితే యాత్రలు చేసుకున్న ఫలితం దక్కదు. ఐనా, ఇవన్నీ తరువాత చెబుతా

నంటినికదా, ఇంతలోనే ఎందుకు తొందర" అనేసి రెడ్డి స్నేహితుణ్ణి తృప్తిపరిచాడు.

రెడ్డి ఇలా మందలించటంచేత మరి కొన్ని క్షేత్రాలు దర్శించేవరకు శేషయ్య ప్రశ్నలేమీ వేయలేదు.

కాని, వారు తిరిగి తిరిగి భద్రాచల క్షేత్రం చేరుకునేసరికల్లా శెట్టికి మళ్లీ గుబులు పుట్టుకువచ్చింది. అక్కడ ముకుళిత హస్తుడైవున్న ఆంజనేయ స్వామి విగ్రహం చూచి, శేషయ్య "రెడ్డీ! పోనీ, ఇదైనా చెప్పవయ్యా. ఈ హనుమంతుడు ఇలా చేతులు రెండూ జోడించి నించోవటానికి గల కారణం యేమిటి?" అని అదేపనిగా అడుగజొచ్చాడు.

చెంగల్‌రెడ్డి కోపం నటిస్తూ "ఓయి శెట్టీ! ఎంతసేపూ ఆ విగ్రహాల చేతులూ మూతులూ చూడటమేకాని ఆ స్వాములను మనసారా ధ్యానించుకున్నట్టు కనపడదే. ఇల్లు వదలి ఇంతదూరం వచ్చింది యిందుకేనా?" అని మందలించేసరికి శెట్టి ఏమీ అనలేక అప్పటికి వూరుకున్నాడు.

చివరకు వారిద్దరూ శ్రీరామచంద్ర మూర్తివారిని దర్శించుకుని రామభక్తిలో ఐక్యమై తరించిపోదామనే సంకల్పంతో








గుడిలోపల ప్రవేశించారు. రెడ్డి కన్నులు మూసికొని తదేకధ్యానంతో ఏవో శ్లోకాలూ స్తోత్రాలూ పఠిస్తున్నాడు కాని, శేషయ్య శెట్టిమాత్రం రాముల వారి చేతులవంకనే విడ్డూరంగా చూస్తూనిలబడివున్నాడు.

చెంగలరెడ్డి ధ్యానం పూర్తిచేసుకుని కన్నులు తెరవటంతోనే శేషయ్య గబగబ అతనివద్దకు పోయి, "ఓయి నేస్తం!— ఈసారి నీవు తప్పించుకోటానికి వీల్లేదు. ఈ రాములవారు చేతివ్రేళ్లతో చిటికపట్టి వున్నాడే, ఎందుకో చెబుతావా లేదా? చెబితే కాని వదలను, ఏమైనాసరే" అని పట్టు పట్టాడు.

రెడ్డి ఏమీ చెప్పలేక తెల్లబోయేసరికి, శేషయ్య శెట్టి ఉగ్రుడై "ఏమయ్యా రెడ్డీ! ఈ యాత్రలకని నాచేత డబ్బంతా తగలెట్టించావు. యాత్రలు చేస్తే లోకజ్ఞానం ఎక్కువవుతుందన్నావు, సంశయాలు తీరిపోతాయన్నావు. తీరా ఈ వూళ్లన్నీ తిప్పి తిప్పి, నాప్రశ్నలు ఒక్కదానికి సమాధానం చెప్పకుండా మోసగిస్తావా?—సరేకానీ, నీ పుణ్యమూ నాకు వద్దు, నీ స్నేహమూ నాకు వద్దు. నీమానాన నీవు పో..." అంటూ కచ్చితంగా నాలుగు మాటలూ దులిపేసి, అతన్ని వదిలించుకుని తనొక్కడూ బయల్దేరి ఇంటికి వచ్చేశాడు.

*  *  *

శేషయ్య శెట్టి ఇంటికి చేరుకున్నాడే గాని, అతని దృష్టి అంతా తను చూచి వచ్చిన ఆయా స్వాములు ఏవిధంగా చేతులు పట్టారో వాటిపైనే వుంది. ఎన్నాళ్లు ఆలోచించినా అతనికి ఆ సంశయాలు తీరనేలేదు. 'సరే, ఎంత డబ్బయినా ఖర్చుపెట్టి ఈ సంశయాలు తీర్చుకోవాలి. లేకుంటే జన్మసార్థకం లేదు' అని నిశ్చయించుకున్నాడు. తన సమస్యలకు ఎవరైతే సరియైన సమాధానం చెప్పకోగలరో వారికి

కోరిన బహుమతి ఇస్తానని నగరంలో ప్రకటన చేశాడు.

శేషయ్యశెట్టి చేసిన ప్రకటన విని, దేశదేశాలనుంచి వేదాలు వల్లించినవారూ, సమస్త శాస్త్రాలలోనూ పండిపోయినవారూ ఉజ్జయినిలో దిగారు. శెట్టిగారిలోగిట్లో గొప్ప పండిత సభ ఏర్పాటయింది. శాస్త్రుల్లవాళ్లందరూ అనేకమైన అర్థాలూ, అంతరార్థాలూ, విశేషార్థాలూ శ్రావ్యంగా వినికిడి చేశారేగాని ఎవరేమి చెప్పినా, అందులో ఒక్కటీ శెట్టి మనసుకి నచ్చనేలేదు.




ఇంతలో సభలోనించి రంగన్న అనే ఒక రైతు లేచి, "దీనికోసమని ఈ పండితులంతా ఎందుకు? ఈ హడావుడి అంతా దేనికి? మా శేషయ్యన్నకు నేను నచ్చజెప్తానుండండి!" అంటూ ముందుకు వచ్చేసరికి, పండితులంతా తెల్లబోయి చూస్తూ కూర్చున్నారు.

అప్పుడు రంగన్న ఇలా చెప్పసాగాడు: "శేషయ్యన్నా!—ఇంత అనుభవమూ ఉండి ఈమాత్రం రహస్యం తెలుసుకోలేకపోయావా?—అ కళ్లళఘుర్స్వామి 'మా క్షేత్రంలో భూములు ఎంత సారవంతమైనవో తెలుసా? ఇక్కడ పొగాకు బాగా ఒక గజం పొడవున పెరుగుతుంది' అని చెప్పటానికే తన చేతులు ఒకటి పైనా రెండవది కిందా ఒక గజం దూరంలో పెట్టి అందరకూ తెలిసేటట్టు ప్రత్యక్షంగా చూపిస్తున్నాడయ్యా" అన్నాడు. ఈజవాబు నచ్చినట్టుండి, విరక్తిభావంతోవున్న శేషయ్యముఖాన చిరునవ్వు చిందులాడింది.

తరువాత రంగన్న మళ్లీ అందుకున్నాడు: "అన్నా! అవిధంగా పెరిగినటువంటి పొగాకు ఇంత వెడల్పు కలిగివుంటుందయ్యా!' అని కంచి వరదరాజస్వామివారు తన రెండు చేతులూ చాపి మనకు చూపిస్తున్నారుసుమా" అనేసరికి, శేషయ్య

శెట్టి ఆనందానికి మేరలేకపోయింది. "మరైతే అక్కడ భద్రాచలంలో. హనుమంతుడు ఎందుకు చేతులు జోడించి నిలబడ్డాడు?" అంటూ ఆత్రంతో అడిగాడు శెట్టి.

అందుకు రంగన్న "అబ్బాయిలూ!— 'అంత పొడవుగానూ, అంత వెడల్పుగానూ పెరిగినటువంటి పొగాకు మట్ట ఇంత లావుగా వుంటుంది సుమా!' అని ఆంజనేయస్వామివారి వుద్దేశం" అంటూ శెట్టి వేసిన మూడవ ప్రశ్నకు సమాధానం చెప్పాడు. రంగన్న తెలివికి సంతోషించి శేషయ్య ఆశ్చర్యంలో మునిగిపోయాడు.

"రంగన్నా! నీవు చెప్పినవన్నీ బాగానే వున్నై. మరి, రాములవారి మాట ఏమిటి?" అని తొందరపాటుతో ప్రశ్నించాడు శేషయ్య.

"అన్నయ్యా! ఇంత దేశం చుట్టి వచ్చావే. ఈపాటి విషయం తెలుసుకోలేకపోతే నీ లోకజ్ఞానం ఏమనుకోవాలె. సరే రాములవారి వుద్దేశం చెబుతా విను. 'ఇటువంటి ప్రశస్తమైన పొగాకుతో తయారైన నస్యము ఒక్క చిటికెడు పీలిస్తే చాలదా, కైలాసం కనబడటానికి?' అనే భావం మనకు చెప్పటానికే అవతారమూర్తి ఐన ఆ మహానుభావుడు అలా చిటికె పట్టుకొని వున్నాడు" అని చెప్పేసరికల్లా శేషయ్యశెట్టి తన్మయత్వంతో రంగన్నను కౌగిలించుకుని "ఓయి రంగన్నా! నీ బుద్ధివిశేషం ఇంతటిదని ఎరక్క ఈ పండితులందరినీ రప్పించాను. ఇవాళ నాకు పర్వదినంగా వుంది. నా యాత్ర సార్థకమైంది" అని అనేక విధాల మెచ్చుకుంటూ, రంగన్న కోరిన బహుమతులిచ్చి పంపాడు.

"శెట్టి మనసుకి నచ్చిన మాటలతో మనలో ఒకళ్లమూ భావార్థం చెప్పలేకపోయాము. ఎందుకు వచ్చిన పాండిత్యం మనది!" అనుకొంటూ వెలవెలబోయిన ముఖాలతో పండితులందరూ నెమ్మదిగా జారుకున్నారు.





# కీర్తికాంత

పూర్వకాలమందు కొండవీడులో రాయన్న అనే ఒకాయన ఉండేవాడు. ఆయనకు భాస్కరుడనే ఒక కొడుకు. రాయన్న కొడుకుకావటంచేత అతనిని రాయనభాస్కరుడు అని పిలుస్తూవచ్చారు. ఈ రాయన భాస్కరుడికి పుట్టినప్పటినించీ దానం చేయటమంటే మహా ప్రీతిగా వుండేది. 'లేదు' అనే మాట ఆయన నోటివెంబడి ఎన్నడూ రాలేదట. చివరకు, చిన్ననాడు గుణింతాలు నేర్చుకొనేటప్పుడుకూడా ఈ రెండక్షరాలూ ఆయన చేతితో వ్రాయలేదని ఆ కాలంలో ప్రజలు చెప్పుకొనేవారు.

చిన్ననాటనే ఇంతటి ఉదారంగా వుండే భాస్కరుడు పెరిగి పెద్దవాడైనకొద్దీ ఎన్నో దానాలు చేస్తూ వచ్చాడు. క్రమంగా కొండవీడుకి అధిపతి అయేసరికి, ఆయన చేసిన దానాలకు లెక్కే లేకపోయింది. పురాణ కాలంలో బలిచక్రవర్తి, కర్ణుడు ఎంత పేరు పొందారో, ఈ కలియుగంలో రాయన భాస్కరుడు అంత పేరు పొందాడు. రాయనభాస్కరుణ్ణి మించిన మహాదాత ఈ భూలోకంలో లేడు అనే కీర్తి దేశమంతటా మోగిపోయింది.

ఇటువంటి రాయనభాస్కరుడు గొప్ప కీర్తి సంపాదించి, కొంతకాలానికి స్వర్గస్థుడయాడు. మేరలేకుండా ఆయన చేసిన మహా దానాలవల్ల కీర్తివైతే వచ్చిందికాని, ఖజానా మటుకు ఖాళీ అయిపోయింది. అందుచేత క్రమంగా వారి కుటుంబం పేదరికంలోకి దిగవలసివచ్చింది.

ఈ రాయనభాస్కరుడికి కొండయ్యా అనే కుమారుడు ఉండేవాడు. కొండయ్యా సేనాధిపతిగా వుండి, ఎంత పేదరికం వచ్చినా, గౌరవంగానే గడుపుకొంటూ వచ్చాడు. కొంతకాలానికి కొండయ్యాకూడా గతించాడు. కొండయ్యాకు ఒక కొడుకు.

పువ్వుల సరోజిని, బష్వేల్



వానికి తాతపేరే పెట్టి, చినభాస్కరుడు అని పిలిచేవారు.

చితికిపోయిన సంసారం కావటంవల్ల, చినభాస్కరుడూ తల్లీ ఒక చిన్న ఇంటిలో తలదాచుకొంటూ, కొద్దిలో కుటుంబపోషణ సాగిస్తూ వచ్చారు. డబ్బుకి ఎంత యిబ్బందిగా వున్నప్పటికీ, చినభాస్కరుడు బడిలో చదువుమాత్రం మానకుండా వుండేందుకు తల్లి తగిన యేర్పాటు చేసింది.

ఒకరోజున చినభాస్కరుడు బళ్ళో వుండగా, ఒక భట్టురాజు అక్కడికివచ్చి, పంతులుతో అమాటా ఈమాటా చెబుతూ "అయ్యా మేష్టారూ! కీర్తికాంత ఆ రాయన భాస్కరులవారితోనే పోయింది సుమండీ!" అంటూ ఒక పద్యం చెప్పాడు.

ఈ మాట చెవిని పడీపడటంతోనే చినభాస్కరుడు రోషం పట్టలేక చేతనున్న బంగారు మురుగులలో ఒకటితీసి అ భట్టురాజుకి ఇచ్చివేశాడు. ఇంత సాహసంగల ఆ బుడుతడు ఎవడా అని ఆశ్చర్యంతో పంతులును అడిగాడు భట్టురాజు. అతడు ఫలానా రాయనిభాస్కరుని మనుమడు అని తెలియగానే భట్టురాజు తన ధోరణి మార్చి, "కీర్తికాంత వెళ్ళిపోయిందనుకున్నాము. కాని వెళ్ళలేదు. ఆమె ఇక్కడనే వున్నది సుమా!" అని అర్థమిచ్చేలాగ మరొక పద్యం చెప్పి, చినభాస్కరుని పొగడుతూ అ మురుగు తీసుకుని చక్కాపోయాడు.

చినభాస్కరుడు పౌరుషపడి మురుగు ఇచ్చివేశాడేకాని, ఇంటికివెళితే తన మొండి చెయ్యిచూచి తల్లి కోపగిస్తుందేమోనని భయపడుతూనే వున్నాడు. ఈ భయంచేత అతడు చేతికి రుమాలు చుట్టబెట్టుకుని సాయంకాలానికి ఇల్లు చేరుకున్నాడు. తల్లి ఎంత పిలిచినా అన్నానికి వెళ్ళడు. చెయి

పైకి తీయడు. ఏమీ తోచక ఆ చాటునా ఈ చాటునా తిరుగజొచ్చాడు.

చివరకు ఆమె బిడ్డవద్దకుపోయి, చెయ్యి పట్టుకుని చూడగా మురుగులేదు. "ఏమైందిరా అబ్బాయీ ?" అని అడిగేసరికి చెప్పలేక చెప్పలేక మెలిమెల్లిగా జరిగిన సంగతి అంతా చెప్పాడు. చెప్పినదంతా విని, ఆమె కోపంతో "ఓరి వాజమ్మా, ఇంతేనా నీ తెలివి తేటలు!" అని ఒక్క లెంపకాయ కొట్టింది. దెబ్బతిన్న భాస్కరుడు "అమ్మా, అమ్మా! కొట్టకే. ఆ భట్రాజు ఎక్కడ వున్నాడో వెతికి పట్టి, నా మురుగు మళ్ళా నేను తెచ్చుకుంటాను" అంటూ యేడ్చాడు.

భాస్కరుడు ఈ విధంగా ఏడ్చేసరికి అతని తల్లి మరింతగా నొచ్చుకుంది. "అది కాదురా మూర్ఖుడా! రాయనిభాస్కరుని మనుమడివై ఉండిన్నీ, ఒక్క మురుగు మాత్రం ఇచ్చి రెండవ మురుగు దాచుకుంటివే. ఇది పిసినిగొట్టుతనం కాదా? మీ తాతకీర్తికీ, మన వంశానికీ అప్రతిష్ఠ కాదా? అందుకోసం కొట్టాను కాని, నువు మురుగు యిచ్చావని కాదు. ఇప్పుడైతేనేం, ఊళ్లోకి పోయి ఆ భట్టురాజుని వెతికి పట్టుకొని ఈ రెండవ మురుగు కూడా ఇచ్చిరా, పో!



రాయనభాస్కరుని మనుమడివి అనిపించుకో" అని మందలించింది.

వెంటనే చినభాస్కరుడు సంతోషంతో బయల్దేరి వెళ్ళి, భట్రాజును వెతికి పట్టి, అతనికి తనరెండవ మురుగుకూడా బహుమతిచేసి వచ్చాడు. తాతపేరు నిలబెట్టిన చినభాస్కరుణ్ణీ, చినభాస్కరునివంటి ధన్యుణ్ణి కన్న ఆ మాతృదేవినీ లోకులు వేవిధాల కొనియాడారు. భాస్కరుని చరిత్ర సూర్యుని తేజస్సుతో ప్రకాశిస్తూ, నేటికి కూడా శాశ్వతంగా నిలిచింది. ఇటువంటి మహా దాతలు ఉండబట్టే మన దేశం ధర్మానికీ, త్యాగానికీ పుట్టినిల్లయింది.




ఒకానొకప్పుడు పాటలీపురాన్ని ఉత్తుంగభుజుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. ఆయనకు ఇద్దరు భార్యలు. పెద్దభార్యకు నందుడనే ఒక కుమారుడుకూడా ఉన్నాడు. ఇద్దరు భార్యలతోనూ హాయిగా కాలక్షేపం చేస్తూ, ఉత్తుంగభుజుడు సమస్తమైన సంపదలతో తులతూగుతూ ఉండేవాడు.

ఇలా వుండగా ఎందుచేతనోగాని, రాజుకు ఒకప్పుడు పెద్దభార్యయందు అనిష్టమూ, చిన్నభార్యయందు అనురాగమూ కలుగజొచ్చింది. అయితే, ఇందుకు కారణం ఒకటై ఉండవచ్చు. ఏమీ అంటే—చిన్నభార్య అతి లోకసౌందర్యవతీ, మంచి మాటకారిన్నీ. అటువంటప్పుడు రాజు ఆమెకు లొంగిపోవటంలో ఆశ్చర్యమేమున్నది? ఆయన ఎంతవరకు లొంగిపోయినాడంటే—చిన్నభార్య గీచిన గీటు దాటేవాడేకాదు. పైగా ఆమె అనుగ్రహిస్తే చాలు, అదే తనకు మోక్షమనుకుని, ఎన్నివిధాలనైనా ఆమెను మెప్పించడమే జీవితానికి పరమావధి అని అనుకున్నాడు.

చిన్నభార్యను మెప్పించటం బాగానే వుంది. ఎవరూ వద్దనరు. కాని, పట్టపుదేవీ, ఆమె కుమారుడూ బతికివున్నారా లేదా అని ఐనా రాజు ఒక్కనాడూ కనుక్కున్న పాపాన పోనేలేదు. వాళ్లకు తిండీ గుడ్డా సంగతి యేమిటా అని ఆయనకు ఎన్నడూ ఆలోచనే లేకపోయింది. చివరకు, పట్టపురాణి కొడుకైన నందుణ్ణిసైతం నోటారా "రారా నాయనా!" అని పిలవటానికైనా నోచుకోలేక పోయాడన్నమాట. అంతవరకు ప్రాకిపోయింది రాజుకి పట్టపు రాణిమీద పట్టిన ద్వేషం. తండ్రి చూపే పక్షపాతబుద్ధీ, అతని వింత చర్యలూ చూడగా, పసివాడైన నందునికి చాలా

బిరుసుమహంతి మల్లికార్జునరావు, జయపురం

మనసు కష్టమనిపించింది. కాని, చేయగల దేముంది? చిన్నబోయిన ముఖంతో ఏదో విధంగా అలానే కాలం నెట్టుతూ వచ్చాడు.

రాజు సమాచారం ఇలా ఉంటూ వుండగా—ఒకనాడు నగరులోకి ఒక గొప్ప బట్టల వర్తకుడు వచ్చాడు. అతడు ప్రభువుల దర్బారులోకి తగినటువంటి విలువైన గొప్ప వస్త్రాలు తీసుకవచ్చాడు. ఆ వర్తకుడు సరాసరి కోటలోకి పోయి రాజావారి దర్శనం చేయగా, ఆయన వేయివరాల విలువ చేసే చీర ఒకటి వెంటనే కొని చిన్నరాణి ముచ్చట తీర్చాడు.




ఈ సంగతి ఎలాగో పట్టపురాణి చెవుల బడింది. రాజుకి తన మీద మక్కువ లేదన్న సంగతి ఆమెకు తెలుసు. ఐనా, సవతికి రాజు అంత చక్కటి చీర కొని పెడుతూవుంటే చూస్తూ తను ఊరుకోగలదా?—అందుచేత, ఉండబట్టలేక ఏమైతే కానీ అని చెప్పి, "అటువంటి చీర నాక్కూడా ఒకటి కొనిపెట్టవలిసింది" అంటూ ఆమె మహారాజుకి వర్తమానం పంపించింది. కాని, మహారాజు ఆ కబురు తెచ్చిన పరిచారికను కసిరికొట్టి, "యేడిపిందిలే. దాని బతుక్కి ఇటువంటి చీర ఒకటా! ఉన్నవి చాలునన్నానని చెప్పు, పో!!" అన్నాడు.

దాసీది వచ్చి ఈ సంగతి చెప్పగానే, "అయ్యో, నా గతి ఇంతకు వచ్చింది కదా" అని అనుకొని పట్టపురాణి కుమిలి కుమిలి ఎంతగానో విచారింపసాగింది. అప్పుడు దాసీలలోకల్లా గడుసుదీ, తెలివైనదీ ఒక దాసీ అక్కడికి వచ్చి రాణితో "దేవీ! మీరెందుకు అలా విచారిస్తారు? అంతగా మీకు ఈ చీర కట్టుకోవాలి అని ముచ్చటైతే నేనొక ఉపాయం చెబుతాను వినండి: 'ఒక ఆరుమాసాలలో నీ సొమ్ము నీకిచ్చివేస్తాను' అని చెప్పి వర్తకునివద్ద




చీర అరువు తీసుకోవచ్చు" అని యింకా యేమేమో సలహా చెప్పబోయింది.

ఆ మాట అందుకుని రాణి, "ఓసీ నువ్వు చెప్పిన ఉపాయం బాగానే వున్నదే. మనం అరువు అడగనూవచ్చు, మన మాట నమ్మి వర్తకుడు ఈయనూ వచ్చు. మరి తీరా అరువు తీసుకున్న తరువాత ఈ ఋణం తీరే విధం ఎట్లా? ఒకళ్ల ఋణాన్న పడివుండటం మహాపాపం కదా! అప్పు చేసి పప్పుకూడూ తినుమన్నట్లు, ఋణం చేసి చీరెలు కొనడం కంటె ఇలా పేదరికం అనుభవించటమే మేలు కదా? ఇంతకూ మహారాజుగారి అనుగ్రహమే నాకు వెలితి ఐనప్పుడు, చీరెలూ, నగలూ వెలితి అయితేనేమి?..." అంటూ తన ఆవేదన వెల్లడించింది.

ఇందుకు ఆ దాసీది మళ్లీ ఒక శ్లోక రూపంలో ఇలా జవాబు చెప్పింది:

ఉత్తుంగభుజ నాశో వా
దేశ కాల విపర్యయః।
వణిగ్వర వినాశో వా
సందోరాజా భవిష్యతి॥

అనగా—'మనము గడువు పెట్టిన ఆరుమాసాలలోపున ప్రభువైన ఉత్తుంగభుజమహారాజయినా కాలము చేయవచ్చు. దేశంలోనూ, కాలంలోనూ అనుకోకుండా మార్పులు రావచ్చు. ఈ వర్తకుడే గతించవచ్చు. లేదా మననందుడే రాజు కావచ్చు. ఏ నిమిషానికి ఏమి జరగబోతుందో ఎవరు చెప్పగలరు?' అని ఈ శ్లోకానికి అర్థం.

అప్పుడు రాణి, "ఓసీ నీవు చెప్పిన మాటలన్నీ బాగానే ఉన్నాయి. కాని, మహారాజునుగురించి అడిన మాటమాత్రం నాకు కష్టంగా తోస్తున్నది. మహారాజే లేని పక్షమందు నాకీ చీరలెందుకు? వస్త్ర వాహనాలెందుకు?" అని ఒకవిధమైన విరక్తిభావంతో మాటాడజొచ్చింది.

అందుకు దాసీది "తల్లీ!—మహారాజు గారు ఉన్నంతకాలమూ మీరు ఆ చీర సుఖంగా కట్టుకోవచ్చు. ఒకవేళ ఆయన పోవడమే జరిగితే రాజ్యం మీ కుమారుని చేతిలోకే వస్తుంది గనక, వర్తకునికి సొమ్మిచ్చివేయవచ్చు. ఆ తరువాత చీరె మీ కోడలు కట్టుకోవచ్చు. ఆయన బ్రతికి బాగా వున్నప్పటికీ మరేదైనా మార్పు రావచ్చు. కాబట్టి, ఏవిధంగా ఆలోచించినా మీరు ఈ చీర తీసికొనటమే మేలని నా వుద్దేశం" అని నొక్కి చెప్పింది.




దాసీది చెప్పిన మాటలు రాణికి బాగా నచ్చినై. పైగా ఇటువంటి చీర తన సవతి కొన్నదికదా, తనకు లేకపోవటం లోకంలో తలవంపులు కదా అని ఈర్ష్య ఒకవంక బాధిస్తూ ఉండె. అదీగాక, సహజంగా ఆడవాళ్లకు ఉండే నైజాన్నిబట్టి ఆమె మనసు మరల్చుకోలేకపోయింది. అందుచేత రాణి ఆ దాసిదానితో చెప్పి వెంటనే వర్తకుని పిలిపించింది. ఆరు నెలల్లో వెల ఇచ్చివేస్తామని వప్పుకొని, కుమారుడిచేత ఒక తాటాకు ముక్క మీద పద్దు వ్రాయించి వర్తకునికిప్పించి, ఆమె చీరె తీసి కట్టుకుంది. తన కోరిక పూర్తిగా ఫలించినందుకు పట్టపురాణి పట్టరాని సంతోషం పొందింది. తల్లి సంకల్పం నెరవేరినందుకు నందుడు ఎంతగానో ఉత్సాహం పొందాడు. తన బుద్ధివిశేషంవల్లకదా దేవి ముచ్చట తీరిందని చెప్పి దాసీది పొంగిపోయింది.

ఇలా ఐదు మాసాలు గడిచేసరికి, దైవవశాత్తు ఉత్తుంగభుజమహారాజుకి జబ్బు చేసింది. రోజురోజుకీ ఆ జబ్బు జబ్బు ముదిరిపోజొచ్చింది కాని తిరుగు ముఖం పట్టలేదు. కాలం సమీపిస్తున్నదని గ్రహించి మహారాజు తన మంత్రులను పిలిపించాడు. వారితో "ఓయి మంత్రులారా! నా తదనంతరం నా రెండవ భార్య కుమారు

నికే పట్టం కట్టండి. ఇదే నాకు మిగిలి వున్న కోరిక. నా కోరిక తప్పక నెరవేరుస్తారనే నమ్మికతోనూ తృప్తితోనూ నేను పరలోకానికి వెళ్లిపోతున్నాను" అని చెప్పి, మరికొద్దిరోజులకే ఆయన కాలధర్మం చేశాడు.

మహారాజు మరణించిన తరువాత మంత్రులందరూ చేరి ఆలోచించగా, రాజు కోరిక నెరవేర్చటానికి సాధ్యంగా కనిపించలేదు. ఏమీ అంటే నందుడు పట్టపుదేవికి పుట్టిన జ్యేష్ఠుడు. ధర్మశాస్త్రాలన్నీ అతని పక్షాన్నే తీర్పు చెబుతున్నాయి. పైగా, లోకులందరూ అతనిమీదనే ఎక్కువ అనురాగం కలిగి వున్నారు. అదీగాక— విద్య, వినయము, ఔదార్యము, బాహుబలము, శౌర్యము, చక్కదనమూ ఈ సుగుణాలన్నీ నందునిలో యిమిడి వున్నాయి. ఇన్ని సందర్భాలు తోసిపుచ్చి, రాజు కోరిక ఎలా నెరవేర్చటం? కాబట్టి నందుడే తగినవాడు అని నిశ్చయించి, వానికే పట్టం కట్టారు.

నందుడు పట్టాభిషిక్తుడు ఐనవెంటనే ముందుగా తల్లికి చీర యిచ్చిన బట్టల వర్తకుని పిలిపించి, చీర వెల వేయి వరహాలూ చెల్లించివేశాడు. తనపైన నమ్మకం ఉంచినందుకుగాను మరిఒక వేయి వరహాలుకూడా బహుమానం చేశాడు.

ఈవిధంగా బుద్ధిచాతుర్యంగల ఆ దాసీదాని నోటివాక్యం ఫలించి, నందుడు రాజు కావడం జరిగింది. పట్టపురాణికి దాసి చెప్పిన శ్లోకం గొప్ప పరమార్థంతో కూడుకొని వున్నది గనుకనే నేటికిన్నీ ఒక సామెతగా నిలిచిపోయింది. 'ఏమో, ఏ నిమిషానికి ఏది ఎలా జరుగబోతుందో' అంటూ, రాబోయే కాలాన్నిగురించి మనకు స్పష్టంగా తెలియదు అని చెప్పవలసివచ్చినప్పుడు 'నందో రాజా భవిష్యతి' అంటూ ఉండటం ఇప్పటికీ వాడుకలో వుంది.



ఏదుపందికి ఒళ్లంతా ముళ్లే

CHITRA

# ఎందుకో తెలుసా?

పంచపాండవులలో మూడవవాడైన అర్జునుడు ఒకప్పుడు పాశుపతాస్త్రంకోసమని పరమేశ్వరుణ్ణిగురించి గాఢమైన తపస్సు చేయసాగాడు. అతని తపస్సుకి మెచ్చిన ఈశ్వరుడు అర్జునునికి ప్రత్యక్షమై అస్త్రం ఇచ్చి వద్దామని భూలోకానికి బయల్దేరాడు. ఈ సంగతి పార్వతికి తెలిసి, "నాథా! నేనూ మీవెంట వస్తాను. అర్జునుడు పరాక్రమవంతుడనీ, విలువిద్యలో ప్రవీణుడనీ చెప్పుకొంటారే, ఆ పరాక్రమమేమిటో ఆ ప్రావీణ్యమేమిటో చూదామని వుంది" అన్నది. శంకరుడు వప్పుకొన్నాడు.

అంతట పార్వతీ పరమేశ్వరులు, తమ పరివారంతో సహా కిరాతరూపాలు ధరించి, అర్జునుడు తపస్సు చేసే అరణ్యం ప్రవేశించారు. అక్కడ చూలుతో వున్న ఒక పంది అగుపడేసరికి ఆ పరివారం దానిని తరుమజొచ్చారు. ఆ పంది ఘీంకరిస్తూ అర్జునుడి ఆశ్రమ సమీపానికి పోయింది. ఆ పంది చేసే ఘీంకారానికీ, వేటకాడు చేసే సందడికీ తపోనిష్ఠలోవున్న అర్జునుడు లేచి తన గాండీవంతో ఆ పందిపైన శరవర్షం కురిపించాడు. శరములన్నీ వెళ్లి దాని శరీరానికి సందులేకుండా గుచ్చుకున్నాయి.

ఇలా జరిగేసరికల్లా కిరాతరూపంలో వున్న పార్వతీ పరమేశ్వరులు అక్కడికి చక్కావచ్చారు. "మా పరివారం వేటాడబోయిన పందిమీద బాణాలు వేయటానికి నీవెవరవు?" అన్నాడు శంకరుడు.

అందుకు అర్జునుడు "గొప్ప ప్రశ్నే వేశావే? తపోభంగం చేయవచ్చిన మృగాన్ని తగిలేయక ఊరుకొంటారా?" అంటూ బదులు చెప్పాడు. దానితో మాటా మాటా రెచ్చిపోయి కలహం ప్రారంభమై అది క్రమంగా ఒక యుద్ధంగా పరిణమించింది. ఆ యుద్ధంలో సవ్యసాచి తన గాండీ

ఈ నెల బహుమతి పొందిన కథ — గొని జైసీతారామిరెడ్డి - కొగిర, (అనంతపురం)

* బహుమతిగా ఫిబ్రవరి '51 నుంచి ఒక సంవత్సరం వరకు 'చందమామ' పంపబడుతున్నది.

వాన్ని అనేక విధాల ప్రయోగించేసరికి, అతని విలువిద్యాప్రావీణ్యం ఎటువంటిదో పార్వతి కళ్లవేడుకగా చూసింది. అప్పుడు కిరాతరూపంలో వున్న ఈశ్వరుడు యుద్ధం చాలించి తను నిజరూపంలో ప్రత్యక్షమై తమ సంకల్పాన్ని వెల్లడించగా అర్జునుడు చాలా సంతోషించాడు.

ఆ సమయంలో దాక్కొనివున్న పంది, పాపం ప్రసవవేదనా మరణవేదనా కూడా అనుభవిస్తూ, మూల్గుతూవున్నది. దాన్ని చూచి పార్వతీదేవికి జాలివేసింది. ఆమెతో ఆ పంది "అమ్మా, బాణపు దెబ్బలు తగిలి నా కడుపులో పిల్లలన్నీ చచ్చిపోయినై. ఇక నేనుమాత్రం బతికి యేమి చేయాలి? కాబట్టి, దయవుంచి ఈ బాణాలు నా ఒంటి నుండి ఊడలాగినట్టయితే ఆ వెంటనే నా ప్రాణాలు పోతవి, తీరిపోతుంది. ఈ మేలు చేసి పుణ్యం కట్టుకో తల్లీ!" అని దీనంగా ప్రార్థించింది.

అప్పుడు పరమేశ్వరుడు దానితో "ఓయి సూకరమా! నీకు గుచ్చుకున్న శరములు సామాన్యమైనవి కావు. అవి అర్జునుడి గాండీవంలోనించి వదలబడిన అమోఘ శరములు. వాటిని పెకలించటం ఎవరికీ సాధ్యం కాదు. ఈ శరములను నీ శరీరానికి అందమిచ్చే సహజసిద్ధమైన వాడి ముండ్లుగా మారుస్తున్నాను. ఇంతటినుండి నీది 'ఏదుపంది' అనే ఒక ప్రత్యేక జాతిగా ఏర్పడివుంటుంది. నేను సృష్టించిన ఈ ముళ్లు నీకు అందమివ్వటమేగాక శత్రురక్షణకు పనివచ్చే ఒక కవచంగా కూడా ఉపకరిస్తయ్. కనుక నీకూ, నీ పిల్లలకూ వచ్చిన భయమేమీ లేదు" అంటూ కొద్దిగా గంగాజలం దానిమీద చల్లేసరికి, ఆ పందికి పునర్జన్మ ఎత్తినట్టనిపించి, సుఖంగా ప్రసవించింది. పరమేశ్వరుని వరంవల్ల ఆ పిల్లలన్నీ ముళ్లతోనే పుట్టాయి. ఏదుపంది జాతి అలా సృష్టిఅయింది.








కుర్రవాడు: అమ్మా! పుస్తకం కొనుక్కోవాలి. ఒక అణా తక్కువైంది రూపాయి యియ్యవే.

తల్లి: అణా తక్కువైతే రూపాయెందుకురా?

కుర్రవాడు: నిన్న లెక్క చెప్పేటప్పుడు నువ్వే చెబితివిగా, అణా తక్కువైతే రూపాయి అప్పు తెచ్చుకోవాలని!



మేష్టరు: మీ వాడికి అన్నిటిలోనూ గుండు సున్నాలే, చూచారా?

తండ్రి: ఏం చెయ్యనండి! ఎన్నడైనా పుస్తకం తాకి ఏడిస్తేనా?

పిల్లవాడు: కాదు నాన్నా, పుస్తకం తాకితేనే ఏడుపొస్తుంది.



మేష్టరు: ఒరే, వాడు నిన్ను తిడితే నువ్వు మళ్లీ వాణ్ణి తిట్టాలిగాని కొట్టావెందుకురా!

కుర్రవాడు: వాడికి బ్రహ్మచెముడండి! తిడితే వినపడదని కొట్టానండి.



పంతులు: ఒరే గోపీ! అక్బరునుగురించి నీకు తెలిసింది చెప్పు?

గోపి: పాదుషాల పేర్లు అకారాదిగా వరసన రాస్తే అక్బరు పేరు మొదట వస్తుందండి!

# పాత పాటలు

(సేకరణ : టేకుమళ్ళ కామేశ్వరరావు)



నవ్వుతూ అయ్యమ్మ నంది పూజించి
ఆ నంది పూజలకు నీళ్లు లేవనెను.
తవ్వించె మా తాత తోపల్ల చెరువు
తోపల్ల చెరువుకి తోడులేదనుచు.
వేయించె మా తాత వేళ్లతో మర్రి
వేళ్లతో మర్రికి ఎరువు లేదనుచు.
గడుతిరుగ యెరువెట్టి గంగనీరెట్టె
చెరువుపక్కని నిమ్మ తోటవేశాడు
చుట్టుతిరుగ యెరువెట్టి నిమ్మనీరెట్టె.

* * *

ఆ తోవ వెళ్లేరు పేదబ్రాహ్మల్లు
ఆ నీరు తాగేరు నీడలట్టేరు
ఆ పళ్లు తిన్నారు పాట పాడేరు
ఊడుతిన్నట్టుగా పళ్లు తిన్నారు
పుణ్యాపంతుడి తోట కాసిపరగాలి.
పాలు తాగినట్లు నీళ్లు తాగేరు
పుణ్యావంతుడి చెరువు పూర్తిపరగాలి.

పచ్చన్ని చెట్టుకి నిచ్చెన్న వేసి
రక్షకుడు నా మరిది కూరనన్నడిగె.
కలగూర తేమరిది! కంద తేమరిది!
పెండలం తేమరిది! వండి పెడతాను.
ఉప్పునీళ్ళాతోను ఉడకదూ కంద
మంచినీళ్ళూ లేక మగ్గదూ కంద
చింతపండూతోను చివకదూ కంద
వండ నేర్పింతేను కందమ్మ రుచులు!
వడ్డించ నేర్పింటె వదినమ్మతల్లి!

* * *

ఆచారి గుర్రమూ బహుదొడ్డ గుర్రం
మంత్రాలమూట మరి మోసి మోసి
గడ్డింతలేకనూ కడుపంత ఎండి
వేంచేసె గుర్రమూ ఆ దేవలోకం

* * *

ముసిలాడు మా తాత పసినిమ్మపండు
పడుచుదానిని పెండ్లాడి పైకాపులుండె.





పైన 1 నుంచి 51 వరకు వున్న చుక్కలు కలిపితే మీకొక దొంగ దొరుకుతాడు.

## వినోద చదరం

ప్రక్కనున్న చదరాన్ని ఈ క్రింది ఆధారముల సహాయంతో పూర్తిచెయ్యాలి. సరియైన మాటలతో పూర్తిచేసినట్టయితే ప్రతి మాటలోని చివరి అక్షరం ఒకేలాగ వస్తుంది. అంతేకాదు రెండవగడిలో వచ్చే అక్షరాలని పైనుంచి క్రిందకు వరసగా చదివితే మన నాయకులలో ఒకరి పేరు వస్తుంది.

ఆధారములు యివి :

1. మేక
2. ద్వీపి
3. కీశు
4. వెంటాడుట
5. జానిన
6. మకిల

సరియైన జవాబుకు 55-వ పేజీ చూడండి.

| | | | |
|---|---|---|---|
| 1. | | | |
| 2. | | | |
| 3. | | | |
| 4. | | | |
| 5. | | | |
| 6. | | | |



# ఇంద్రజాలము

## నిప్పుపుల్లని విరిచి మామూలుగా చెయ్యటం

ఇంద్రజాలికుడు పట్టుకువచ్చిన జేబురుమాలు మడతలలో ఒక కొత్త నిప్పుపుల్లను వుంచగా, ప్రేక్షకులలో ఒకరు ఆ పుల్లని విరుస్తారు. ఇంద్రజాలికుడు ఆ చేతిగుడ్డ మడతలు విదిలించేసరికి నిప్పుపుల్ల మామూలు కొత్తదానిలాగానే వుంటుంది. ఇది ఎలాసాధ్యమవుతుందని మీ వూహ?

ఈ ట్రిక్కు చెయ్యటానికి ముందుగా ఒక మాయ జేబురుమాలు తయారుచేసి తెచ్చుకోవాలి. ఈ జేబురుమాలు అంచులు మడిచి కుట్టబడి ఉంటాయి. అలాంటి మడుపులో నీవు అంతకుముందే ఒక నిప్పుపుల్ల దూర్చి వుంచుతావు. ఈ విధంగా తయారుచేసుకొన్న జేబురుమాలుతో నీవు సభకు వస్తావన్నమాట.



ప్రేక్షకుల ఎదట నిలబడి జేబురుమాలును బల్లపైన పరు. లేదా అరచేతిలో వుంచుకో. తర్వాత ప్రేక్షకులలో ఎవరినైనా తమదగ్గిర వున్న ఒక నిప్పుపుల్లను చేతిగుడ్డ మధ్యని వుంచమను. అలా వుంచిన తరువాత నీవు జేబురుమాలు మడతపెట్టు. నీవు యిలా మడతపెట్టేటప్పుడు, అంతకు ముందుగా నీవు దాచివుంచిన నిప్పుపుల్ల అంచు పైకి వచ్చేట్టు చేసి, ప్రేక్షకుడు పెట్టిన నిప్పుపుల్ల చేతిగుడ్డ మడతలో క్రిందవైపు వుండేటట్టు చెయ్యాలి. అప్పుడు ప్రేక్షకుణ్ణి పిలిచి, పైనవున్న నిప్పుపుల్లని విరవమను. అతను అలాగే చేస్తాడు. నిప్పుపుల్ల విరిగిన చప్పుడు ప్రేక్షకులందరికీ వినిపిస్తుంది. తరువాత నీవు ఏదో మంత్రం చదివినటు

నటించి, నీ చేతిని రుమాలు చుట్టూ తిప్పి, దాని మడతలు విప్పు. ప్రేక్షకుడు తన చేతులతో తను స్వయంగా విరిచిన పుల్ల ఏవిధమైన మార్పులేకుండా మామూలుగా వుండటంచూచి ఆశ్చర్యపోతాడు.

ప్రేక్షకులకు అనుమానం కలగకుండా వుండేందుకు వాళ్లు జేబురుమాలులో పెటే నిప్పుపుల్లకి గుర్తు పెట్టుకోవచ్చు. నీవు చేతి గుడ్డని విదిలించి చూపినప్పుడు వాళ్లు గుర్తు పెట్టుకున్న నిప్పుపుల్ల కనిపించేసరికి నీ ట్రిక్కు విషయమై వారికి మరింత నమ్మకం కలుగుతుంది.

బొమ్మలు చూడు. అంచులు మడత బెట్టి కుట్టబడిన రుమాలు ఎలా వుండాలో నీవు నిప్పుపుల్ల ఎక్కడ దాచివుంచాలో మొదటి బొమ్మలో చూపబడింది. అలా తయారు చేసుకున్న రుమాలులో ప్రేక్షకుడు నిప్పుపుల్లని పెట్టిన తర్వాత ఎలా మడత పెట్టాలో ప్రేక్షకుడు నిప్పుపుల్ల విరిచిన తర్వాత నిప్పుపుల్ల మామూలుగా కనిపించటం దాని ప్రక్క బొమ్మలో వుంది.

[పాఠకులు, ఈ గారడినిగురించి సలహాలను పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీములోనే వ్రాయాలి. వారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజిషియన్,
పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.]

# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

**అడ్డము:**

1. చట్టి
3. బాణము
5. నాగలి
7. రామభక్తురాలు
8. సూర్యుడు
11. తూచుట
14. చిన్న నది
16. తరువాత
18. ఏనుగు
19. ముని




**నిలువు:**

1. దప్పిక
2. స్వప్నము
3. పార్వతి
4. చుట్టుకొలత
6. ఒక రాక్షసుడు
7. ఒక గ్రహము
9. తల్లి
10. ఒక అప్సరస
11. నాలుగుకుంచాలు
12. కోతి
13. రాజు
15. దగ్గర
17. కనికరము

# అట్టమీది బొమ్మ

ఒకరోజున బలరామ, కృష్ణులు సాందీపమునివద్దకు వెళ్లి, వినయపూర్వకంగా "గురువర్యా!—మాకు విద్యలన్నీ పూర్తి ఐనవని అంటిరికదా. ఇదంతా మీ కృపావిశేషంగాని వేరొకటి కాదు. అనుజ్ఞ ఇచ్చితిరంటే మేము మా తలిదండ్రులవద్దకు వెళ్లదలచి ఉన్నాము" అనేసరికి "తప్పక పోయిరండి: మీకు శుభమవుతుంది" అంటూ దీవించాడు గురువుగారు." "ఐతే, మహాత్మా!—మేము మా విధి నెరవేర్చుకోవద్దా? గురుదక్షిణ ఏమిటి సమర్పించుకోమంటారో సెలవియ్యండి, మీ కోరిక ఏదైనప్పటికీ నెరవేర్చటానికి సిద్ధంగా ఉన్నా" మన్నారు, బలరామ కృష్ణులు. అందుకు సాందీపనుడు ప్రియశిష్యుల అద్భుత మహిమకు మెచ్చుకొని ఈ సంగతి తన భార్యతో సంప్రతించాడు. ఆమెకూడా శిష్యుల సమర్థతకు సంతోషించి, "ఫలానా అప్పుడు ప్రభాసక్షేత్రంవద మన అబ్బాయి సముద్రంలో పడి చచ్చిపోయాడుకద! వాడు కంటబడితే చాలు, అంతకంటె మనకు కోరవలసిందేమున్నది" అన్నది. వెంటనే బలరామ కృష్ణులు రథంమీద ప్రభాస క్షేత్రానికి వెళ్లి అక్కడ దిగేసరికల్లా వీరి రాకను ఎరిగిన సాగరుడు పైకివచ్చి వారిని అనేకవిధాల పూజించి "మహాత్ములారా!—మీరు వచ్చిన కార్యము నాకు తెలుసు. మీ గురుపుత్రుణ్ణి శంఖ రూపం ధరించివుండే పంచజనుడనే రాక్షసుడు హరించివున్నాడు. నా అంతర్జలమందే వాని నివాసము" అని చెప్పాడు. వారు లోనికి చొచ్చి, పంచజనుని తెగటార్చారు. కాని, పిల్లవాడుమాత్రం కనపడలేదు. అప్పుడు వారు యమలోకం చేరుకొని పాంచజన్యమనే శంఖం పూరించగా, అది విని యమధర్మరాజు తటాలున ఎదురువచ్చి, వారిని పూజించి; వచ్చినపని యేమో సెలవీయమన్నాడు. వారు తమ కార్యమును వెల్లడించగా, తక్షణమే యముడు ఆత్మలోకంలో వుండే ఆ పిల్లవానిని తెచ్చి సమర్పించాడు. వానిని తీసుకువెళ్లి బలరామ కృష్ణులు గురువులకు దక్షిణకింద సమర్పించేసరికి సాందీపనుడూ, భార్యా అపరిమితానందభరితులై, వారిని వేవిధాల దీవించి, ఇంటికి పంపారు. ఈవిధంగా విద్యాభ్యాసం పూర్తిచేసుకొన్న బలరామ కృష్ణులు గురువుల ఋణం తీర్చుకొని, సంతోషంతో మధురాపురి చేరుకొన్నారు.

పజిలుకి జవాబు:

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 దా | 2 క | | | | 3 అం | 4 ప |
| 5 హ | ల | 6 ము | | 7 శ | బ | రి |
| ము | | 8 ర | 9 జ | ని | | ధి |
| | | | స | | | |
| 10 మే | | 11 తూ | ని | 12 క | | 13 భూ |
| 14 న | 15 ద | ము | | 16 పి | 17 ద | ప |
| 18 క | రి | | | | 19 య | తి |

51-వ పేజీలోని

వినోదచదరానికి జవాబు:

| | | | |
|---|---|---|---|
| 1. | అ | జ | ము |
| 2. | ర | వ | ము |
| 3. | ద్రో | హ | ము |
| 4. | త | రు | ము |
| 5. | గు | లా | ము |
| 6. | చి | లు | ము |

## "ఎందుకో తెలుసా?"



"ఏదు పందికి ఒళ్ళంతా ముళ్ళే! ఎందుకోతెలుసా?" అన్నదానినిగురించి మాకు వచ్చిన కథలలో కల్లా ఉత్తమంగా వున్న కథని ఈ సంచికలో ప్రచురించాం. ఈ రచన పంపినది గౌని జైసీతారామిరెడ్డి, కోగిర. (అనంతపురం) బహుమతిగా యితనికి ఫిబ్రవరి 51 నించి ఒక సంవత్సరం వరకు 'చందమామ' పంపబడుతున్నది.

వచ్చేనెల (మార్చి '51) కు
'తాబేటిచిప్ప చాల గట్టిగా ఉంటుంది'
ఎందుకో తెలుసా?

అనే విషయాన్ని గురించి మీరు తెలుసుకుని ఒక చక్కటి కథ వ్రాసి పంపండి. రెండు పేజీలకు మించకుండా వుండాలి. కథలు ఫిబ్రవరి 15-వ తేదీలోగా మాకు చేరేట్టు ఈ క్రింది అడ్రసుకు పంపండి.



"కథల తాతయ్య"

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు 1686, మదరాసు-1




ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (మార్చి)
చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI, at the B. N. K. Press, Madras-1

